# మ్యూనిజం

C

జూన్ - 1993



ప్రఖ్యాత మార్క్సిస్టు తత్వవేత్త దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ

# కమ్యూనిజం

సంపుటి : 18  జూన్ 1993  సంచిక : 2

ఈ సంచికలో :

విడి ప్రతి — రూ. 3.00

సంవత్సర చందా — రూ. 36/-

---

"కమ్యూనిజం" పత్రికలో వెలువడుతున్న వ్యాసాలలోని భావాలతో పత్రికా సంపాదకవర్గం ఏకీభవించనవసరంలేదు. అవి రచయితల అభిప్రాయాలు మాత్రమే.

—కమ్యూనిజం సంపాదకవర్గం

---

*సంపాదకవర్గం :*

ఈడ్పుగంటి నాగేశ్వరరావు
(సంపాదకుడు)

ఏటుకూరు బలరామమూర్తి

పరకాల పట్టాభి రామారావు

# దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ
# భౌతికవాద ధోరణిని ఉద్ధరించిన తత్వవేత్త

ఏటుకూరు బలరామమూర్తి

**[1993, మే 8 వ తేదీన, తన 75 వ ఏట మరణించిన దేవీప్రసాద్‌కు నివాళిగా]**

దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ 1918 లో కలకత్తాలో ప్రముఖ పండితుల కుటుంబంలో జన్మించాడు. ఆయన తండ్రి చిన్నపుడే, దేవీప్రసాద్‌కు అద్వైత వేదాంత బోధనకై గురువును ఏర్పరచాడు.

బి. ఎ; యం. ఎ; పరీక్షలను ఉన్నత శ్రేణిలో ప్యాసైన మీదట 1943 నుండి కలకత్తా, బొంబాయి కళాశాలల్లో తత్వశాస్త్రాన్ని సుమారు రెండు దశాబ్దాలు బోధించారు. ప్రముఖ తత్వవేత్త, బహు గ్రంథ రచయిత ఐన యస్. యన్. దాస్‌గుప్త వద్ద తత్వశాస్త్రాన్ని అభ్యసించారు.

డాక్టరు రాధాకృష్ణన్, యస్. యన్.దాస్‌గుప్తా లిద్దరూ తత్వశాస్త్ర బోధనలో ప్రపంచ ఖ్యాతి గాంచినవారు. వాక్శుద్ధి జ్ఞాపకశక్తి, బోధనా సామర్థ్యాలకు రాధాకృష్ణన్, పేరు తెచ్చుకోగా, దాస్ గుప్తా పాండిత్య ప్రకర్షలో అఖండుడు అంటారు.

ఛటోపాధ్యాయ 1942 ప్రాంతంలోనే మార్క్సిస్టు సిద్ధాంతంతో ప్రభావితులై, కమ్యూనిస్టు ఉద్యమంతో తాదాత్మ్యం ఏర్పరచుకున్నారు. ఆనాటి బెంగాల్ రాష్ట్ర కమిటీ కార్యదర్శి భవానీసేన్ దేవీప్రసాద్‌కు గురుతుల్యుడు.

దేవీప్రసాద్, బెంగాలీ భాషలో 40కి పైగా తాత్విక గ్రంథాలు రచించాడు. కొన్నిటికి సంపాదకత్వం వహించాడు. ఆంగ్లంలో ఆయన రచించిన 'లోకాయత'తో (1959) అఖిలభారత ఖ్యాతి మాత్రమేగాక అంతర్జాతీయ మార్క్సిస్టు తత్వవేత్తల దృష్టిని కూడా ఆకర్షించాడు.

పిమ్మట ఆయన వరుసగా పెక్కు ఉత్తమ గ్రంథాలను ఆంగ్లంలో రచించాడు.

భారతీయ తత్వశాస్త్ర పరిచయం (1964), భారతీయ నాస్తికవాదం, మార్క్సిస్టు విశ్లేషణ (1969), భారతీయ తత్వశాస్త్రంలో సజీవ, నిర్జీవ విభాగాలు (1976), ప్రాచీన కాలంలో శాస్త్రీయ విజ్ఞానం. ఇవిగాక ఎన్నో పత్రికలకు సంపాదకత్వం వహించాడు. అసంఖ్యాకంగా తాత్విక వ్యాసాలు రాశాడు.

నవ్య న్యాయం (తర్కంపై)లో దేవీప్రసాద్‌ను పరమ ప్రామాణికునిగా చెప్పవచ్చు. నవ్య న్యాయ పండితులంతా కలకత్తా సమీపంలోని సందర్ బాన్స్ [సుందరవనం] ప్రాంతంలో కేంద్రీకృతులై ఉన్నారు. అది బెంగాల్ ప్రత్యేకత గౌతమ తర్కశాస్త్రం ప్రాచీనమైనది. నవ్య న్యాయశాస్త్రం 14, 15 శతాబ్దాల తర్వాత మాత్రమే వృద్ధి చెందిన విభాగం. నవ్యన్యాయంలోని భౌతికవాద లక్షణాలను దేవీప్రసాద్‌లాగా విశ్లేషించిన మరో తత్వవేత్త భారతదేశంలో లేదంటే అతిశయోక్తికాదు.

సోవియట్‌లాండ్ నెహ్రూ బహుమతి [1975], బల్గేరియాలో జరిగిన ప్రపంచ తాత్విక మహాసభ ఉపాధ్యక్ష పదవి [1973] జర్మన్ విజ్ఞాన శాస్త్రాల సంఘం సభ్యత్వం – ఇవి వారు పొందిన జాతీయ, అంతర్జాతీయ గౌరవాలలో కొన్ని మాత్రమే. బెంగాలీ సాహిత్య పరిషత్తుకు ఒక తడవ అధ్యక్షత వహించారు.

దీర్ఘ కాలం వారు కలకత్తాలోని ఆసియాటిక్ సొసైటీ ప్రచురణ విభాగాల బాధ్యత నిర్వహించారు. తారానాథ్ రచించిన భారతదేశంలో బౌద్ధం చరిత్రకు సంపాదకత్వం వహించారు.

సుప్రసిద్ధ జర్మన్ మార్క్సిస్టు తత్వవేత్త వాల్టర్ రూబెన్ కు తాను శిష్యుడనని దేవీప్రసాద్ సవినయంగా చెప్పుకుంటూ ఉంటారు. వారి ఆంగ్ల గ్రంథాలకు పెక్కింటికి రూబెన్ పీఠికలు రాశారు. అన్నట్లు కీ. శే. ఉప్పల లక్ష్మణరావుగారు, రూబెన్ రాసిన 'భారతదేశంలో బానిసల స్థితిగతులు' గ్రంథాన్ని అనువదించిన విషయం ఈ సందర్భంలో చెప్పాలి. విశాలాంధ్ర ప్రచురణాలయం ఆ గ్రంథాన్ని ప్రచురించింది.

# సిద్ధాంతం – ఆచరణ

మార్క్సిజం కేవలం సిద్ధాంతం మాత్రమే కాదు. సమాజాన్ని విప్లవాత్మకంగా మార్చేందుకు ఉద్దేశితమైన కార్యాచరణ. అందుకు కంకణం ధరించినవి, వివిధ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు. మంచికో, చెడుకో కమ్యూనిస్టుపార్టీ వివిధ దశలలో అనుసరించిన ప్రత్యక్ష రాజకీయ కార్యకలాపాలు, మార్క్సిస్టు సిద్ధాంత అవగాహనపైన, తాత్విక విశ్లేషణపైన ప్రభావం కలిగిస్తూ వచ్చాయి. ప్రత్యక్ష రాజకీయ కార్యకలాపాలకు – తాత్విక సిద్ధాంత విశ్లేషణకు కొంత దూరం ఉంటుంది, ఉండాలి అని ఎన్ని చెప్పినా, రాజకీయ ఉద్యమ ఉధృతిలో ఆ దూరాన్ని విస్మరించడం భారతదేశంలో తరచు జరుగుతూ వచ్చింది.

1972 లో మరణించిన కీ. శే. భవానీసేన్ మొదటి నుండి కేవలం రాజకీయ నాయకుడే కాక తాత్విక, విశ్లేషణా సామర్థ్యం కలిగిన పండితుడు కూడా కావటమే దేవీప్రసాద్ సాన్నిహిత్యానికి కారణం.

1948–49 కాలంలో భవానీసేన్, రణదివేకు కుడిభుజంగా, దాదాపు ఆయన తరవాత అంతటివాడుగా కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రాధాన్యత వహించాడు.

'మార్క్సివాది' అనే సిద్ధాంత పత్రికలో భవానీసేన్ 'ప్రాచీన కాలంలో భౌతికవాద సమస్యలపై' ఒక వ్యాసం రాస్తూ, రవీంద్రనాథ్‌టాగూర్‌పై ఘాటైన విమర్శ చేశాడు. ఒక మిత్రుడు ఆ వ్యాసాన్ని దేవీప్రసాద్‌కు చూపి 'మీ అభిప్రాయం ఏమి' అని అడగ్గా, "నాకది నచ్చలేదు" అని మర్యాదగా చెప్పాడు. ఆ మిత్రుడు వెంటనే "ఆ వ్యాసం రాసింది ఎవరో తెలుసా" అన్నాడట "ఔను, తెలుసు. మారు పేరుతో రాసినా ఆయన్ని నేను గుర్తుపట్టగలను. ఐనా ఆ వ్యాసం నాకు నచ్చలేదు" అని దేవీప్రసాద్ సమాధానమిచ్చాడు.

అలాంటి సమాధానం ఇవ్వటానికి ఆ కాలంలో ఎంతో ఆత్మవిశ్వాసం,గుండె ధైర్యం అవసరమని వేరే చెప్పనక్కరలేదు. ఇదేవ్యాసాన్ని లండన్‌లోని ఆనాటివిద్యార్థి ప్రముఖ మార్క్సిస్టు పండితుడు పామీదత్తుకు చూపగా, సూటిగా విమర్శించకుండా "లెనిన్, టాల్ స్టాయిని గురించి ఏమిచెప్పాడో మరొకసారి చదవండి"అని మాత్రం మర్యాదగా చెప్పి ఊరుకున్నాడు.

తర్వాత బెంగాల్‌లో చాలాకాలం సిద్ధాంత వివాదాలు జరిగాయి భవానీసేన్ తన లోపాలను గుర్తించారు. దేవీప్రసాద్‌ను స్వయంగా కలుసుకున్నాడు. "తత్వ

శాస్త్రంలో మీరు చాలా అనుభవం కలవారు. స్వయంగా మీరే మార్క్సిస్టు విశ్లేషణతో ప్రాచీన భౌతికవాదంపై రాయగల సమర్థులు" అని ప్రోత్సహించారు.

దాని ఫలితంగానే అత్యుత్తమమైన 'లోకాయత' గ్రంథం వెలువడ్డది. ఆ గ్రంథాన్ని ఎంతగానో ప్రశంసిస్తూ భవానీసేన్ సమీక్ష చేశాడు.

తాత్విక విశ్లేషణ ఎంతటి రాజకీయోద్యమ ఒడుదుడుకులకు, వత్తిళ్ళకు లోనయ్యేదో తెలియజేసేందుకే ఈ ఉదంతం ప్రస్తావిస్తున్నాను.

## 'లోకాయత'

'లోకాయత' గ్రంథ రచనలో దేవీప్రసాద్ అనుసరించిన మౌలిక పరిశీలనా పద్ధతిని క్లుప్తంగా తెలుసుకోవటం ఉపయోగకరంగా ఉంటుంది.

మాతృస్వామిక సమాజ దశలో తంత్రవాదం మొదలైంది. శాకంబరి అను దేవతా చిహ్నం హెరప్ప శిథిలాలలో లభించింది. భూమి స్త్రీ అని, ఆకాశం లేక సూర్యుడు పురుషుడనీ, పురుషుని నుండి స్రవించే రేతస్సు వర్షమనీ, తత్ఫలితంగా భూమిలో పంటలు పండుతాయని ఆనాటి ప్రజల విశ్వాసం. శాకంబరి దేవత, నగ్నంగా ఉండే స్త్రీ బొమ్మ.

ఆర్యులలోను మాతృస్వామిక దశ ఉంది. కాని వారు సంచార జాతిగా మన దేశం వచ్చారు. కనుక వ్యవసాయ ప్రధానమైన తంత్ర విద్య వారిలో లేదు. మన దేశం వచ్చిన తర్వాత వారు మంత్ర విద్యను వృద్ధి చేశారు. తంత్రం అంటే ప్రకృతి చర్యలను అనుకరించటం. మంత్రం అంటే అనుకరణతోపాటు మంత్రోచ్చారణ చేయటం. ఈ రెండూ భ్రమలే. అజ్ఞాన జనితాలే. ఐనా ఆనాటి విశ్వాసాలు అని గుర్తించటమే ప్రస్తుతాంశం.

తంత్ర విద్యలో స్త్రీకి ముఖ్యస్థానం ఉన్నందున క్రమంగా యోని పూజ, లింగపూజ మొదలయ్యాయి. శిశ్నదేవారాధకులని అర్యులు, అనార్యులను చులకనగా భావించింది ఇందువల్లనే. ఆ తర్వాత చాలా కాలానికి శిశ్నదేవుడే, లింగాకారంలో పవిత్రతను పొంది శివారాధన వైదికమత రూపాలలో ఒకటైంది. అధర్వణవేద కాలంనాటికి ఈ సమ్మిశ్రణం జరిగింది.

ఆ పిమ్మట శాక్తేయం, ఉచ్ఛిష్టగణపతి పూజ, వజ్రయానంరూపాలలో తంత్రవాదం దీర్ఘకాలం కొనసాగుతూ వచ్చింది. హైందవంలోని శాక్తేయం మహాయానంలోని వజ్రయానం రెండూ ఒకటే. తంత్రవాద ప్రాముఖ్యత వల్లనే సామూహిక లైంగిక సంపర్కాలు కూడలి స్థలాల్లో జరిపే ఆచారం ఆనాటికాలంలో ఏర్పడ్డది. ఈనాటికీ కొన్ని తెగల, ప్రజల పండుగలలో ఇవి కనిపి

స్తాయి. దేవాలయాల్లో బూతు బొమ్మలు ఏర్పడటానికి ఈ తాంత్రికాచార ప్రాబల్యమే కారణం. స్త్రీ ప్రధానమైనది కనుకే, దానిని వామాచారమన్నారు. వామా అంటే స్త్రీ.

తత్వశాస్త్రంలో భౌతికవాదం ఉద్దాలక అరుణితో మొదలైంది. ఇతని కాలం క్రీ. పూ. 700. ప్రకృతి శక్తుల కన్నిటికీ జీవమున్నదని ఉద్దాలక అరుణి వాదన. ఇందుకు ప్రతిగా యాజ్ఞవల్క్యుడు మానవునిలో మాత్రమే 'ఆత్మ' ఉన్నదని శరీరం నశించినా ఆత్మ శాశ్వతమనే భావవాదాన్ని ప్రతిపాదించాడు. నాటినుండి భౌతికవాద భావవాద సంఘర్షణ సాగుతూనే ఉంది.

పూర్వమీమాంసావాదం క్రీ. శకారంభంలో తలఎత్తింది. అప్పటికి వర్గ సమాజం ఏర్పడ్డది. వర్ణ విభజన భారతదేశంలో దృఢపడ్డది. వర్గ పూర్వ సమాజాలు తంత్రవిద్యను అనుసరించారంటే అర్ధం చేసుకోగలం. వర్గ సమాజ ఆవిర్భావం తర్వాత వ్యవసాయం నగరీకరణ జరిగిన కూడా మంత్ర విద్య ద్వారా, ప్రకృతిని శాసించగలమని భావించిన పూర్వమీమాంసకులు యజ్ఞయాగాది క్రతువులను పట్టుదలతో పునరుద్ధరించారు. దైవ భావాన్ని పీచ త్రోసిపుచ్చారు. "మంత్రాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతం" దేవుడు అనేవాడు ఉంటే, అతడు సైతం మంత్రానికి లొంగవలసినవాడే అనేది పూర్వమీమాంసకుల వాదన. దాంతో పాటు మరో రెండుమాటలను చేర్చారు.

"తన్మంత్రం బ్రాహ్మణాధీనం
బ్రాహ్మణోమ మదైవతా"

ఇందులో మూఢత్వం ఉంది, అగ్రవర్ణ దురహంకారమూ ఉంది. మధ్యయుగాల అంధకారం అలముకున్నది. చార్వాక, జైన, బౌద్ధులు- యజ్ఞ యాగాది కర్మకాండను దాదాపు నిర్మూలించిన పిమ్మట, పూర్వమీమాంసాధోరణి క్రీస్తు శకారంభంలో పుట్టి, 7, 8 శతాబ్దాలపాటు కొనసాగటమే ఆశ్చర్యం. చరిత్రలోనూ, తత్వశాస్త్రంలోనూ ఇది దీర్ఘ తిరోగమన దశ.

పూర్వమీమాంసకులు దైవ భావాన్ని తోసిపుచ్చింది, భవిష్యత్ తాత్విక పురోగతి దృష్ట్యా కాదు, గత కాలపు తంత్రవిద్య దృష్ట్యా. ఇలా జరగటం ఆశ్చర్యం, దురదృష్టకరం.

తంత్రం నుండే మతం, విజ్ఞాన శాస్త్రం రెండూ ఆవిర్భవించాయి. తంత్రంలోని వ్యతిరేక పార్శ్వం మతంగా మారింది. మానవుని అశక్తతకు మతం

తార్కాణం. తంత్రంలోని అనుకూల పార్శ్వం నుండి విజ్ఞాన శాస్త్రం ఉద్భవించింది.

మత మౌఢ్యానికి, శాస్త్ర విజ్ఞానానికి నిరంతరం ఘర్షణ జరుగుతూనే వచ్చింది. ఏ మేరకు మత మౌఢ్యాన్ని ఛేదించగలిగామో, ఆ మేరకు శాస్త్రవిజ్ఞానం వికసిస్తూ వచ్చింది.

దైవభావాన్ని ఆత్మభావాన్ని బౌద్ధులు కూడా త్రోసిపుచ్చారు. కాగా వారు 'సామాజిక ధర్మం' విషయం ప్రత్యేకించి చెప్పారు. బౌద్ధుల అష్టాంగమార్గం అంతా అదే. లోకాయతులు ఆ పిమ్మట వచ్చిన చార్వాకులు వారి వైయక్తిక జీవితాలలో సామాజిక నీతి సూత్రాలను పాటించినవారే. కాగా అదొక ముఖ్యాంశంగా వారు ప్రచారం చేయలేదు. చార్వాక తత్వశాస్త్రం, సామాజికంగా నిలదొక్కుకోక పోవటానికి బహుశా ఇదొక కారణం.

—భారతీయ తత్వశాస్త్రంలో సజీవ, నిర్జీవ విభాగాలు అను రచన దేవీ ప్రసాద్ బృహద్ర రచనలలో (1976) చెప్పుకోదగినది. ఇది చాలా పెద్ద రచన. భారతీయ తత్వశాస్త్ర పరిచయం అనేక భారతీయ భాషలలోకి అనువదించబడ్డది. కాని ఈ బృహత్ రచనను భారతీయ భాషలలో ఎవరూ అనువదించలేదు. తొలి రచన 'లోకాయత'ను సంగ్రహ రూపంలో హైద్రాబాద్ బుక్ట్రస్టు వారు తెలుగులో ప్రచురించారు. భారతీయ తత్వశాస్త్ర పరిచయాన్ని మేము ప్రచురించాము (విశాలాంధ్ర ప్రచురణాలయం).

అద్వైత మత ప్రతిపాదకమైన బ్రహ్మ సూత్రాలు తప్ప, షడ్దర్శనాచార్యులందరూ, సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక పూర్వమీమాంసా ధోరణులవారు పూర్తిగానో, పాక్షికంగానో దైవ భావాన్ని నిరాకరించిన వారేననిదేవీప్రసాద్ సమర్ధవంతంగా నిరూపించారు. యోగంలోను వైశేషికంలోను దైవభావన కనిపించినా, అది చాలా కృత్రిమంగా ఉన్నది. ఆనాటి మతవాదుల తాకిడికి తట్టుకోలేక చేసిన సర్దుబాటు లేక మినహాయింపు మాత్రమేనని వారు నిరూపించారు. తత్వశాస్త్రంపై, మత మౌఢ్యం పైచేయి సంపాదించినందున భారతీయ తత్వశాస్త్రానికి ఈ హాని జరిగింది.

దేవీప్రసాద్ రచనలన్నిటిలోనూ ఈ మౌలిక భావన, పదే పదే పునరావృతమౌతూ ఉంటుంది. వేద శాస్త్ర గ్రంథాల నుండి అసంఖ్యాకమైన ఉల్లేఖనల ద్వారా వారు బహు రూపాలలో ఈ భావాలను ప్రతిపాదించారు.

Marx ఒక సందర్భంలో ఇలా అన్నారు. "Philosophy must become worldly, then the world becomes Philosophical"

(తత్వశాస్త్రం ఐహిక విషయాలను గురించి చర్చించిననాడు, యావత్ప్రపంచం తాత్విక భావ ప్రేరితం అవుతుంది) అని.

ఆకాశ మార్గాన పోతున్న తాత్విక చింతనను భూమార్గం పట్టించటానికి ఎందరో ప్రాచీన, అర్వాచీన తత్వవేత్తలు కృషిచేశారు. ఆధునిక కాలంలో వివేకానంద, రాధాకృష్ణన్ పండితులు అలాంటివారు. వారు భావవాద తాత్వికులు. కాగా ప్రాచీన భౌతికవాదం ప్రాతిపదికగా భావవాద సిద్ధాంతాలన్నిటినీ విశ్లేషించిన దేవీప్రసాద్ చటోపాధ్యాయ కూడా ఇదే తాత్విక పరంపరకు చెందినవారు.

వీరి గ్రంథాలను, వివిధ ప్రాంతీయ భాషలలోకి అనువదించి, విస్తృత ప్రచారం ఇవ్వగలిగిననాడు, మార్క్స్ ఆశించిన మహదాశయం కొంతవరకైనా నెరవేరుతుంది.

మానవ ప్రకృతిలోనే ఒక ద్వైదీభావం ఉంది. భూమిమీద నిలబడి ఆకాశం వైపు చూడటం. "మృత్యోర్మా అమృతంగమయ" అను ఉపనిషత్ సూక్తిలోనే ఈ ఆకాంక్ష వ్యక్తమౌతున్నది.

భూమిమీద దృఢంగా నిలబడటం ఎంత అవసరమో, ఆకాశంవైపు చూటడం, అనగా నిరంతర శాస్త్ర జిజ్ఞాసను పెంచుకోవటం అంతే అవసరం. ఈ రెంటికీ గల సంబంధాన్ని విస్మరించకపోవటం మరీ అవసరం. దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ అలాంటి అవగాహనను వ్యాప్తి చేయటానికే జీవితాంతం కృషి చేశారు. ఆయన ధన్యజీవి.

# గంగా తీర నాగరికత : తత్వశాస్త్ర ఆవిర్భావం

## కీ. శే. దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ (1990)

[దేవీప్రసాద్ చివరి రోజులలో రాసిన గ్రంథాలలో 'ది బిగినింగ్స్' గ్రంథం చాలా ముఖ్యమైనది. నవ కర్ణాటక (బెంగుళూరు) ప్రచురణాలయం వారు, ప్రపంచ తత్వశాస్త్రాన్ని 8 సంపుటాలలో ప్రచురించాలని నిర్ణయించి, సంపాదక బాధ్యతను దేవీప్రసాద్‌కు అప్పగించారు. ఆ ప్రచురణలకు నాందిగా, తత్వశాస్త్ర చరిత్ర ప్రారంభం– (The beginings) వారు రచించారు. అందులోని ఒక అధ్యాయాన్ని ప్రచురిస్తున్నాము. క. సం.]

క్రీ. పూ. 1750 ప్రాంతంలో సింధునదీ తీర నగరాలు సుస్థిర రూపం ధరించాయని పురాతత్వ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఇందుకు కారణం ఏమిటి అనే విషయంలో శాస్త్రజ్ఞులు ఇంకా చర్చ చేస్తూనే ఉన్నారు. ఒకటి మాత్రం స్పష్టం. అంతకు పూర్వమే కొన్ని శతాబ్దాలపాటు, పురోహితవర్గ ప్రాబల్యం కారణంగా సింధు నాగరికతలో స్తబ్ధత, క్షీణత్వం, శైథిల్యం ప్రవేశించాయి. ఆ సమయంలో ఆర్యులు అనబడేవారు ఈ నాగరికతపై దాడి చేశారు. దాంతో అది సర్వనాశనమైంది.

భారతీయ సంస్కృతికి, ఋగ్వేద సంహితను సమకూర్చినవారు ఆర్యులు. ఇవన్నీ పాటల రూపంలో మాత్రమే ప్రచారంలో ఉన్న సూక్తులు, గేయాలు. ఈ గేయ సంకలనంలోని ఊహాశక్తి, ఉత్సాహ స్ఫూర్తి ఆశ్చర్యకరం. ఇంతటి శక్తి వారికెలా లభించింది అనేది ఇప్పటికీ ప్రశ్నార్థకమే.

భౌతిక జీవన విధానం దృష్ట్యా చూస్తే ఆర్యులు అప్పటికి ఇంకా సంచార జాతుల దశలోనే ఉన్నారు. వేదాలను సంకలనం చేసినందున వీరిని వైదిక ప్రజలు అని కూడా అనవచ్చు. అప్పటికి వారికి లిపి జ్ఞానం లేదు. అందుకు సంబంధించిన

సాంకేతిక సాధన పరిజ్ఞానమూ లేదు. కాని అపారమైన సైనిక పరిజ్ఞానం, పాటవం ఉండేవి. నోటిమాట ద్వారా గేయ సంకలనం చేసినవారికి అక్షరజ్ఞానం మాత్రం లేకపోవటం ఆశ్చర్యమే.

అలాంటి ఋగ్వేదానికి గొప్ప తాత్విక ప్రతిష్ఠ ఎలా వచ్చింది. ఆ సూక్తులలో ఎంతో తాత్విక విజ్ఞానం ఉన్నదని ఆ తర్వాత భారతీయులు ఎందుకు భావించారు.

ఋగ్వేద సూక్తులలో గొప్ప తాత్విక విజ్ఞానం నిక్షిప్తమై ఉందనే భావం తర్వాత కాలంవారు ఆరోపించినదే తప్ప నిజంకాదు. అందులో ఉన్నదంతా మతాభినివేశం. తాత్విక చింతన కాదు. ఈ విషయాన్ని నేను కొత్తగా చెప్పటంలేదు. హరిప్రసాదశాస్త్రి అను ప్రముఖ బెంగాలీ పండితుడు, ఒక వ్యాసంలో ఇలా వివరించాడు :

"వేదం అనేమాట వినగానే హిందువులలో అపారమూ, అనూహ్యమూ ఐన గౌరవ భావం కలుగుతున్నది. వేదం చదవటమే ఎంతో సుకృతం ఉంటేనేగాని సాధ్యం కాదని, దానిని అర్థంచేసుకున్నవాడు సాక్షాత్తు హరిహరాదులతో సమానమని హిందువులు భావిస్తారు. శారీరకంగానూ, మానసికంగానూ ఎంతో పవిత్రుడైనవాడు మాత్రమే వేదాధ్యయనం చేయటానికి అర్హుడు. అతడు మాత్రమే వేదసూక్తాలలోని గూఢార్థాలను, మంత్ర రహస్యాలను గ్రహించగలడు. విశ్వామిత్రుడు ఒక మంత్రం జపిస్తాడు. 12 సంవత్సరాలుగా వర్షంలేని ప్రాంతంలో ఒక్కసారిగా కుంభవర్షం కురుస్తుంది. నేనొక మంత్రం జపిస్తాను. నా శత్రువు ఢిల్లీలో ఉన్నాసరే, వెంటనే మరణిస్తాడు. మంత్రశక్తి ఫలితంగా గొడ్రాళ్ళు గర్భవతులౌతారు. వ్యాధిగ్రస్తులు ఆరోగ్యవంతులౌతారు. పేదలు ధనికులౌతారు. మృత్యుముఖంలో ఉన్నవ్యక్తి తిరిగి జీవిస్తాడు. ఏదైనా ఒక విషయాన్ని నిరూపించాలి అనుకుంటే వేదంలో అలా ఉన్నది అని చెబితే చాలు, ఇక ఎవరికీ దానిని కాదనే ధైర్యం ఉండదు. వేదం అద్భుతాలను చేస్తుంది. దాని అర్థాన్ని ఎవరూ గ్రహించలేరు, చదవలేరు, ఆ దరి చేరలేరు, లోతుపాతులను అర్థంచేసుకోలేరు. సరస్వతీదేవి కటాక్షం లేనిదే, పూర్వజన్మ సుకృతం లేనిదే వేదాలను అర్థం చేసుకోవటం అసంభవం. ఇది ఈనాటి మూఢత్వం, అజ్ఞానం.

"ఇంత చేస్తే వేదం అంటే ఏమిటి? వివిధ కాలాలలో, వివిధ పరిస్థితులలో జీవించిన ప్రతిభావంతులైన కవుల పాటలు, గేయాలు, సూక్తుల సంపుటి. సంస్కృత భాషను గురించి అతిగా ప్రశంసించేవారు కొందరున్నారు. వారికి నేను చెప్పేది నచ్చదు. సాక్షాత్తు బ్రహ్మ ముఖంలోనుంచి వేద వాక్యాలు వెలువడ్డాయని విశ్వసిస్తారు. ఇంత చేస్తే వారు వేదం చదివి కూడా ఉండరు. నిజం చెప్పాలంటే, ఆంగ్లంలోని

"పాటలు, గేయాల సువర్ణ సంకలనం" గ్రంథంలాంటిది. పెక్కుమంది ప్రతిభావంతులైన కవుల గేయ సంకలనం."

ఈ విధమైన అంచనా నిజానికి దగ్గరగా, నిజాయితీతో కూడినది. వేదాలను అదే పనిగా ప్రశంసించే మేధో దారిద్ర్య శైథిల్యతకంటే ఇదే నయం.

పురాతత్వవేత్తలంతా ఒక విషయంలో ఏకీభావాన్ని ప్రదర్శిస్తున్నారు. సింధు నాగరికత పతనమైన తర్వాత ఒక వేయి సంవత్సరాలపాటు ఎలాంటి తాత్విక సాహిత్య సృష్టి లేదు. కొందరు దానిని అంధకార యుగం అన్నారు. సమాజం, నిరక్షరాస్యతా యుగంలోని రైతు సమూహాల దశకు వెళ్ళిందని ప్రముఖ పురాతత్వవేత్త ఏ. సి. ఘోష్ అంటున్నాడు.

ఆ పిమ్మట 600 లేక 700 శతాబ్దినాటికి, భారత చరిత్రలో నగరీకరణ రెండోసారి మొదలైంది. కాని దాని కేంద్రం సింధునదీతీరం కాదు, గంగానదీ తీరం. ప్రాచీన చరిత్రకారులు దీనిని రెండవ నగరీకరణ అని అంటున్నారు (మొదటిది సింధుతీరంలో, రెండవది గంగా తీరంలో). దీనిని గురించి చరిత్రకారులు చాలా పరిశోధనలు ఇప్పటికే చేశారు. వేద సాహిత్యానికి అనుబంధాన్ని పేర్కొంటూ ఉపనిషత్ చింతన వెలిసింది. ఒక సరికొత్తగా పురోహిత వర్గం ఉద్భవించింది. దీనిపై ఇంకా పరిశోధన జరగవలసి ఉంది.

ప్రస్తుతానికి ఒక్క అంశం మీదనే కేంద్రీకరించుదాము. ఒక నూతన మేధావి వర్గం ఉద్భవించడానికి తగిన భౌతిక పరిస్థితులు ఏర్పడ్డాయనేది వాస్తవం. తత్వశాస్త్రం మొట్టమొదటిసారిగా ఆవిర్భవించింది. ప్రకృతిని గురించి, మానవుడ్ని గురించి హేతుబద్ధమైన ఆలోచనలకు నాందీ వాక్యం వెలువడ్డది. మంత్ర తంత్రాలపై ఆధారపడిన మేధావివర్గం స్థానే, తాత్విక చర్చలు చేసిన మేధావివర్గం తలఎత్తింది. ఇది విశేషం.

సైనికాధికార ప్రాబల్యం కలిగిన రాజ్యాలు ఆవిర్భవించాయి. దానినే సంస్కృతంలో 'క్షత్రశక్తి' అన్నారు. యుద్ధ నిర్వహణా సామర్థ్యంలో సాంకేతికంగా ఎన్నో మార్పులు వచ్చాయి. మగధ సామ్రాజ్యంలో క్షత్రియులదే సర్వాధికారం. నిజానికిది కొన్ని శతాబ్దాలకు పూర్వమే కురు పాంచాల రాజ్యంలో మొదలైంది. జనపద, మహాజనపద పేర్లతో నగరీకరణ ఆనాడే (మహాభారత కాలంలో) మొదలైంది. ప్రస్తుతం ఉత్తరప్రదేశ్ పశ్చిమ భాగం, హర్యానా, పంజాబ్, రాజస్థాన్ ప్రాంతంలో (కురుక్షేత్ర ప్రాంతం) అది మొదలైంది. యజుర్వేదం, బ్రాహ్మణాలు ఆనాటివి (క్రీ. పూ. 1000-800). ఋగ్వేదం యొక్క కొనసాగింపు

కాలంగా దీనిని మనం చెప్పుకుంటున్నాము. పురోహిత వర్గం తమ ఆధిపత్యాన్ని అప్పటికి కొనసాగిస్తూనే ఉన్నారు. అయితే ఈ కాలంలో ఒక విచిత్రం కనిపిస్తుంది. క్షత్రశక్తిదే పైచేయి, పురోహితవర్గం రెండోస్థానంలో మాత్రమే ఉంది (మహాభారత కాలంనాటి స్థితి).

పురోహితవర్గం పని క్షత్రియులచే యజ్ఞయాగాదులు చేయించటం. ఇందులోని అంతరార్థం ఏమంటే 1) యజ్ఞ యాగాది క్రతు సంబంధమైన పరిజ్ఞానమంతా పురోహితవర్గం చేతుల్లోనే ఉంటుంది. 2) యజ్ఞ సంబంధమైన కర్మకాండ 3) ఆ సమయంలో చదవవలసిన మంత్ర తంత్రాలు. 4) ఎంత ఆహార ద్రవ్యాలు యజ్ఞ కుండంలో హోమం చేయాలి, ఎన్ని పశువులను వధించాలి ఇత్యాది సమాచారంపై పురోహితులదే అంతిమ నిర్ణయం.

కాని ఇదంతా జరగాలంటే రాచరిక వర్గం యొక్క ఆర్థిక తోడ్పాటు అత్యవసరం. ఆ తోడ్పాటు లేనిదే ఒక్క పనీ జరగదు. క్షత్రియులు యజమానులు. దక్షిణలు ఇవ్వవలసింది వారే. పురోహితవర్గాన్ని పోషించేది వారే. ఇంత భారీ ఎత్తున యజ్ఞాలు చేయటం అవసరమని క్షత్రియ పాలకులను ఎలాగా ఒప్పించటం. సక్రమంగా యజ్ఞాలు చేస్తే యజమానులకు అనగా క్షత్రియ పాలక వర్గానికి సకల ఐహిక సుఖాలు లభిస్తాయని నచ్చచెప్పాలి. ఆ పని పురోహితవర్గం చేసింది. వారు చెప్పారు, వీరు విన్నారు, నమ్మారు. దక్షిణలతోనే పురోహితవర్గం బతుకు అంతా ఆధారపడి ఉంది. కనుక వారు నిర్మొహమాటంగా ఒక మాట చెప్పేవారు. పురోహిత వర్గానికి, దక్షిణ యధావిధిగా సమర్పించుకుంటేగాని, యజ్ఞఫలం ఏ మాత్రం యజమానికి లభించదు అని. ఏమైనా, యజమానులపై ఆధారపడే పురోహితవర్గం జీవించింది.

ఎవరీ యజమానులు? క్షత్రియ పాలకులు. నిరంతరం యుద్ధాలద్వారా ధన ధాన్య సమృద్ధిని పొందిన సైనిక పాలకులు. వారు యుద్ధకాలంలో చేసిన దోపిడిలో కొంత భాగం శూద్రులకు కూడా పంచిపెట్టేవారు. (యజ్ఞకాలంలో నిరతాన్న దానం జరుగుతుండేది) శూద్రులు నాటి సమాజంలో మానవులకంటె కొంచెం తక్కువ స్థాయివారుగా పరిగణింపబడేవారు. వైశ్యులు కొంచెం నయం. నెమ్మది నెమ్మదిగా వారు పైకి ఎదుగుతూ వచ్చారు.

ఇది ఎందుకు జరిగింది? ఎలా జరిగింది? ఇది అనివార్యమా, నివార్యమా? చారిత్రకంగా ఈ నిరంతర యుద్ధాలు నిర్వర్తించిన పాత్ర ఏమిటి? అనే విషయాలు చరిత్రకారులకు వదలివేద్దాం. ఒకటి మాత్రం ప్రస్తుత చర్చకు అవసరం. పురోహితవర్గం తమను గురించి ఎన్ని గొప్పలు చెప్పుకున్నప్పటికీ, ఆర్థికంగా,

రాజకీయంగా వారు సైనికాధిపతుల దయా దాక్షిణ్యాలపై ఆధారపడి జీవించినవారు మాత్రమే. ఎన్ని చెప్పినా, పరిపాలనా బాధ్యత కలిగిన లౌకిక శక్తిగా క్షత్రియులు ఉండేవారు. అంటే లౌకికశక్తిది పైచేయిగా ఉండేది. మంత్ర, తంత్రాలను ఆరాధించే పురోహిత వర్గానిది క్రింది స్థాయి మాత్రమే.

భారతదేశంలో తాత్విక చింతన అలా తలఎత్తింది. ఉపనిషత్తులన్నీ ఇందుకు తార్కాణం. [కేకయ అశ్వపతి, జాబాల చక్రవర్తి, జనక మహారాజు, జానశ్రుతి లాంటివారి ఆస్థానాలలోనే ఉపనిషత్ చర్చలు మొదలయ్యాయి.] బౌద్ధ, జైన ధోరణులు ఇదే వాతావరణంలో ఆ తర్వాత ఒకటి రెండు శతాబ్దాలకు తల ఎత్తాయి.

క్షత్రియులే ఉపనిషత్ చింతనకు ప్రోత్సాహకులు అనే వాదనకు ఇదే మూలం.

ఇందులో కొంత సత్యం లేకపోలేదు. రాజకీయ రంగంలో క్షత్రియులు ప్రథమస్థానం ఆక్రమించినందుననే, ఉపనిషత్ చింతన మొదలైనమాట నిజం.

భారతదేశంలో ప్రథమ తత్వవేత్తలు ఎవరూ అనే విషయం ఇక చర్చించుదాం.

# ఉద్దాలక అరుణి

—దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ

ఉద్దాలక అరుణి క్రీ. పూ. 7 లేక 8 వ శతాబ్దానికి చెందినవాడు. ఛాందోగ్యోపనిషత్తులో ఇతని ప్రస్తావన కనిపిస్తుంది.

మార్మిక, తాంత్రిక దృష్టినుండి విడివడి, మొట్టమొదటిసారిగా ప్రకృతిని యధాతథంగా అర్థం చేసుకోటానికి ప్రయత్నించిన తాత్వికుడు. ఇందుకు ఆయన ఒక పద్ధతి అనుసరించాడు.

వేద సూక్తుల నిరంతర పారాయణ ద్వారా నిజమైన జ్ఞానంరాదు. ప్రకృతిలోని కార్యకారణ సంబంధాన్ని గ్రహించాలి. మొదట్లో కేవలం సత్ పదార్థం మాత్రమే ఉండేది. సత్ పదార్థం అంటే ఆయన దృష్టిలో భౌతిక వాస్తవికత. పంచ భూతాలలో కూడిసది సత్ పదార్థం. బ్రహ్మ లేక ఆత్మ అను భావాలు లేవు. 'ఆత్మ' అనే మాటను వాడక తప్పదు అని అంటే, ఆత్మకు పంచ భూతాలతో కూడిన పదార్థం అనే అర్థాన్నే ఉద్దాలకుడు ఇచ్చాడు.

సత్ పదార్థానికి చలనం సహజసిద్ధమైన లక్షణం. ఆహారం లేనిదే మనస్సు పనిచేయదు. తిండి ఉంటేనే చదివిన వేదసూక్తాలనైనా జ్ఞాపకం పెట్టుకునే శక్తి వస్తుంది. కనుక ఆహారం జీవానికి, జ్ఞాపకశక్తికి, మనస్సుకు మూలం.

కావాలంటే మనస్సునే ఆత్మ అని పిలవండి అని ఉద్దాలకుడు అంటాడు.

ఉద్దాలక అరుణి వ్యక్తిగత జీవితం ఏమిటో తెలియదు. ఉద్దాలక జాతకం

అనే బౌద్ధగాథ ననుసరించి, ఇతని తల్లి బానిస స్త్రీ, తండ్రి రాజోద్యోగి. ఉద్దాల వృక్షం క్రింద జన్మించినందున ఉద్దాలకుడు అను పేరు వచ్చింది. ఇతని జన్మస్థలం తక్షశిల.

అనాడు తక్షశిల అన్ని వ్యాపార కేంద్రాల కూడలి. భిన్న భావ స్రవంతులన్నీ అక్కడకు చేరుతుండేవి. మొదట్లో అతడు మునుల ఆశ్రమాలలో చాకిరీ చేసేవాడు. క్రమంగా తాత్విక జిజ్ఞాస పెరిగి, గురువుల ప్రోత్సాహంతో తత్వవేత్త ఐనాడు. ఎందరో గురువులను ఆశ్రయించాడు. గురువుల కులగోత్రాలతో అతనికి నిమిత్తంలేదు.

ఆ రోజుల్లో జీవకుడనే గొప్ప వైద్యుడుండేవాడు. అతడు తక్షశిలావాసి. [జీవకుడు అజాతశత్రుమహారాజు ఆస్థాన వైద్యుడు. ఒకసారి గౌతమబుద్ధునికి కూడా చికిత్స చేశాడు] తాను మద్రదేశంలో విద్యాభ్యాసం చేసినట్లు ఉద్దాలకుడు ఒకచోట అంటాడు. పంజాబ్‌లోని సియాల్ కోట ప్రాంతాన్ని అనాడు మద్రదేశం అనేవారు.

ఆయన తన ప్రసంగంలో కుమ్మరి, కమ్మరి, కంసాలి, పాలవ్యాపారం చేసే వనిత—తదితర చేతివృత్తులవారి నుండి ఉదాహరణలు చెబుతాడు.

ఉద్దాలకుడు, యాజ్ఞవల్క్యుడు జనకరాజు సభలో చర్చలు జరిపినట్లు ఛాందోగ్యోపనిషత్తు తెలియజేస్తుంది.

# ఆనాటి జానపద తాత్వికులు

## దేవీప్రసాద్ ఛటోపాధ్యాయం

మైత్రి లేక మైత్రాయణి ఉపనిషత్తులో ఆ కాలంనాటి జానపద తాత్వికుల ప్రస్తావన ఉంది. ఉపనిషత్తులన్నీ భావవాద బోధకాలుగనక, జానపద తాత్వికులు, నాస్తికులు నరకంలోకి వెళ్ళేవారు అనే నిందా వాక్యాలు సహజంగానే ఉంటాయి. అధో ప్రపంచానికి చెందిన ఈ జానపద తాత్వికులు, బౌద్ధులు, జైనులు కారు.

వేష భాషలలోను, ఆచార వ్యవహారాలలోను వీరు అనాటి సాంప్ర దాయాలకంటె పూర్తిగా భిన్నమైనవారు.

ఈనాటి బైరాగులకు వీరికి పోలికలు కనిపిస్తాయి. బహుశా వీరు అనాటి తాంత్రిక ధోరణికి చెందినవారై ఉంటారు. వీరి వర్ణన ఇలా ఉంది.

"వీరు నిరంతరమూ రణగొణధ్వనులతో కోలాహలంగా ఉంటారు. ఏవో చేతిపనులు చేసుకొంటూ ఉంటారు. నిరంతరం భిక్షాటన చేస్తూ ఉంటారు.

మరి కొందరున్నారు. వారు పట్టణాలలో భిక్షావృత్తి ద్వారా జీవిస్తూ ఉంటారు. వీరంతా మూఢులు. ఐనా వీరు వారి వారి ప్రత్యేక విభాగాలలో పాండిత్యం కలిగి ఉంటారు.

మరి కొందరున్నారు. వీరు కేవలం దుర్మార్గులు. జడలు, విభూతి ధరించి భయంకరంగా, జుగుప్సాకరంగా ఉంటారు. నర్తకులు, నటకులు, ప్రభుత్వ ఉద్యోగాలనుండి తొలగించబడినవారు- ఇలా అమాంబాపతువారు ఉంటారు.

మరికొందరున్నారు. యక్ష, రాక్షస, భూత, పిశాచాల బారినుండి మేము కాపాడుతాం. సర్పాలు, క్రూరజంతువుల విషాలకు విరుగుడు వేస్తాం. అయితే మాకు తగు మూల్యం చెల్లించాలి అని బహిరంగంగానే చెప్పుకుంటారు.

మరి కొందరు రక్తవర్ణ వస్త్రాలు ధరించి, కపాలాలతో భిక్షాటన చేస్తూ చెవులకు అతి పెద్ద పోగులతో వికృతంగా ఉంటారు.

వీరంతా వేదాలపట్ల విశ్వాసం కలిగిన ప్రజలను తప్పుదోవ పట్టించటానికి యత్నిస్తారు.

వీరితో ఎవరూ స్నేహం చేయరాదు. వీరంతా దొంగలు, ధూర్తులు. వీరు ఆత్మను నిరాకరిస్తారు. జ్ఞానం ఏదో, అజ్ఞానం ఏదో వీరికి తెలియదు".

(బహుశా వీరంతా అనాటి తాంత్రికవాద ప్రచారకులు క. సం)

# లోకాయత

**—దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ**

లోకాయత దర్శనాన్ని గురించి తెలుసుకోవడానికి మనకు ఆధారాలేమిటి ? దురదృష్టం కొద్దీ యీ భౌతికవాదాన్ని నిరాకరించి, ఖండించిన గ్రంథాల్లోనే దీన్ని గురించిన సమాచారం తెలుస్తున్నది. లోకాయతుల ప్రత్యర్థుల గ్రంథాల్లో మాత్రమే యిది పూర్వపక్షంగా కనిపిస్తుంది. ఈ దర్శనాన్ని గురించి ప్రత్యేకమైన గ్రంథం లేదని కాదు, ప్రాచీన కాలంలోనూ, మధ్య యుగంలోనూ లోకాయత గ్రంథాలున్నాయని టుక్కి, గార్బె, దాస్‌గుప్త మొదలయినవారు నిదర్శన పూర్వకంగా నిరూపించినారు. ఐతే ఆ గ్రంథాలు మనకు యిప్పుడు లభ్యం కావడం లేదు. దీనికి విరుద్ధంగా, కొంత ఆశను రేకెత్తించే ధోరణిలో శుక్లాజీ, పరీఖ్ అనే వారలు 'తత్వోపప్లవ' అనే గ్రంథాన్ని జయరాశిభట్టు వ్రాసినాడని చెప్పారు. ఈ గ్రంథాన్ని వీరు 1900లో పరిష్కరించి ప్రచురించారు. ఈ గ్రంథంలోని అంశాలను విమర్శనాయుత దృష్టితో చూచినట్లయితే కొంత నిరాశే మిగులుతుంది. ఈ గ్రంథం పేరును విశేషించి చూస్తే పదార్థాలన్నింటినీ త్రోసివేసే సింహగర్జన అనే అర్థం కనిపిస్తుంది. ప్రమాణ శాస్త్రం సాధ్యపడదని నిరూపించడానికి ప్రయత్నించినారు.

"ఆలోచన, చైతన్యం - ఈ రెండూ మానవ మేధస్సు నుండి ఉత్పన్నమవుతాయని' ఏంగెల్స్ చెప్పినాడు. ఇది మరింత స్పష్టంగా కనిపిస్తున్నప్పటికినీ దార్శనికులు గ్రంథాలపై గ్రంథాలను అనేకం వ్రాసినారు. అలా వారు గ్రంథాలు వ్రాస్తూ దీన్ని నిరాకరించినారు. లేదా ఖండించినారు. లేదా మరుగుపరచినారని" జార్జి థామ్సన్ వ్యాఖ్యానించినాడు. 'మానవ మేధస్సును గురించి యథార్థంగా విజ్ఞాన శాస్త్రవేత్త తెలుసుకొన్న విషయంపై, సమకాలీన దార్శనికులు ఆలోచనను గురించి ప్రత్యేకమైన పరిశోధన చేస్తున్నామని చెబుతూ వారి వివాదాలను కొనసాగిస్తూనే ఉన్నారు.'

చైతన్యానికి ఒక ఆశ్రయం ఉండాలనీ, అట్లాంటప్పుడు చైతన్యానికి భౌతిక శరీరం ఆవశ్యకమనీ, జ్ఞాన మీమాంసను రూపొందించిన న్యాయ వైశేషిక దార్శ

వికులు చెప్పినారు వీరు భారతీయ దర్శన సాంప్రదాయంలోనివారే. అంటే శరీరం వున్నప్పుడే చైతన్యముంటుందనే భావం భారతీయ దర్శనశాస్త్రంలో మనకు కని పిస్తుంది. ఐతే, అతి ప్రాచీన కాలంనుండీ అంధ విశ్వాసాలుగా వస్తున్న 'ఆత్మ' 'మోక్షం' అనే వాటి పరిధిలో నుంచి బయటపడేంత ఔన్నత్యానికి వారు పెరగ లేదు. జ్ఞానం, భావం, ఇచ్ఛ – ఇత్యాదులన్నీ దేహంలోవున్న ఆత్మ గుణాలుగా భావించినారు. మోక్షంలో ఆత్మ శరీరాన్ని వదలివేస్తుందనీ, గుణ రహితంగా ఉంటుందనీ, చైతన్య రహితంగా వుంటుందనీ భావించడం జరిగింది. శాస్త్రజ్ఞానాన్ని ఆధారం చేసుకొని జ్ఞాన మీమాంసను నిర్మించడానికి మరొక అడుగు ముందుకు వేయవలసి ఉంది. శరీరానికి భిన్నంగా ఉండే ఆత్మ ఒకటి ఉన్నదనీ, దానికి మోక్షం సిద్ధిస్తుందని చెప్పేదంతా అప్పుడు అర్థరహితంగా కనిపిస్తుంది. ప్రజలను మోసగించడానికై యిటువంటివి చెప్పినారనే విషయాన్ని చార్వాకులు లేదా లోకాయతులు లేదా ప్రాచీన భౌతికవాదులు చేపట్టినారు.

## శంకరుని విమర్శ

వీరిని గురించి శంకరుడు బ్రహ్మసూత్ర భాష్యంలో ఈవిధంగా చెప్పినాడు:

"దేహమే ఆత్మ అని చెప్పే యీ లోకాయతులు దేహానికి భిన్నంగా వున్న ఆత్మను అంగీకరించరు. చతుర్భూతములగు పృథ్వి, నీరు, గాలి, నిప్పు – మొదలైన వాటిల్లో ప్రత్యేకంగా కానీ, సమ్మిశ్రితంగాకానీ, వాటిలో చైతన్యం లేనప్పుడు అవన్నీ ప్రత్యేకమైన పాళ్ళలో కలసి ఒక శరీరంగా ఏర్పడినప్పుడు, వాటిలో నుంచి చైతన్యం ఉత్పన్నమవుతుందన్నారు. రకరకాలైన ధాతువులను కలిపి, పులియబెట్టి, మరగకాచి వడకట్టినప్పుడు వచ్చే ద్రవపదార్థంలో 'మత్తు' అనే గుణం ఎట్లా వస్తుందో అట్లాగే, జ్ఞానం కూడా శరీరంతో పాటే వస్తుందన్నారు. అందువలన చైతన్యయుతమైన శరీరమే మానవుడు అని నిర్వచించారు. శరీరాత్మవాదాన్ని అంగీకరించనందువలన చార్వాకుల దృష్టిలో శరీరం కన్నా భిన్నమైన ఆత్మ లేనందున, మరణానంతరం ఆత్మ స్వర్గానికి పోవడంకానీ, కర్మఫలితాన్ని అనుభవించడం కానీ, మోక్షం పొందడం కానీ – ఇట్లాంటివి ఏమీ లేవన్నారు. 'ఎక్కడ శరీరం ఉంటుందో అక్కడ మనం చైతన్యాన్ని చూస్తాం. శరీరం లేకుండా వుండే చైతన్యాన్ని మనం చూడం. ఒక వస్తువు వుంటే అక్కడ మరొక వస్తువు ఉన్నప్పుడు, మొదటిది లేకుండా రెండోది వుండదో అపుడు మొదటి దాన్ని రెండో దాని గుణంగా భావిస్తాం. ఉదాహరణకు ఎక్కడ కాంతి, వేడి ఉంటాయో అక్కడ నిప్పు వుంటుంది. అంటే నిప్పుకు కాంతి, వేడి అనేవి గుణాలన్న మాట. ప్రాణం, చలనం, చైతన్యం, జ్ఞాపకశక్తి మొదలయినవన్నీ శరీరంలోనే వున్న

ట్లుగా తెలుస్తున్నది. శరీరం లేనప్పుడు ఇవి ఉన్నట్లు కనిపించడం లేదు. శరీరాశ్రితాలుగా కాకుండా ఇవి ప్రత్యేకించి ఉన్నట్లు మనం నిరూపించలేం. కనుక ఇవి శరీరానికి సంబంధించిన గుణాలనే భావించవలసి ఉంటుంది ఐతే, ఆత్మ ఉన్నదని అంగీకరించే వారికి ఇవన్నీ ఆత్మ గుణాలుగా కనిపించి నప్పటికినీ, మా దృష్టిలో శరీరం కంటె భిన్నమైన ఆత్మ మరొకటి లేదు."

బ్రహ్మ సూత్రాల రచయిత రెండు సూత్రాల్లో యీ చార్వాక దర్శనాన్నంతా చెప్పి దాన్ని ఖండించినారు. బౌద్ధ పిటకాల్లో కూడా లోకాయత శబ్దం కనిపిస్తుంది. అంతేగాక, దేహాత్మ వాదాన్ని గురించి చెప్పిన విషయాలు కూడా కనిపిస్తాయి. సాంఖ్య - యోగ దర్శనాల్లోనూ, అర్థశాస్త్రంలోనూ, జైన దర్శనంలోనూ, మహాభారతంలోనూ, ఉపనిషత్తుల్లోనూ యీ లోకాయత దర్శనానికి సంబంధించిన విషయాలను చూడవచ్చు. ఈ విషయాల నన్నింటినీ దృష్టిలో వుంచుకొని గనుక పరిశీలిస్తే భౌతికవాద సాంప్రదాయం కూడా భారతీయ దర్శన శాస్త్రంలో అతి ప్రాచీన కాలం నుండి వున్నదని తెలుస్తున్నది. ఐతే ప్రాచీన భౌతికవాదులకు మనస్సును గురించి గానీ, చైతన్యాన్ని గురించి గానీ స్పష్టంగా తెలుసునని చెప్పలేం కాని వారూహించిన రీతి, వారు సేకరించిన విషయాలు అల్పమైనప్పటికినీ, చైతన్యాన్ని గురించి వారు వివరించిన విధానం ప్రశంసనీయమైనది. నాలుగు భూతములు తప్ప మరోదాన్ని వీరు అంగీకరించరని శంకరుడు చెప్పినాడు. ఈ నాలుగు భూతాల్లో చైతన్యం లేదు. ఐనప్పటికినీ, ఈ నాలుగు భూతాల్లో నుంచే చైతన్యం వస్తుందన్నారు. అది ఎట్లా సాధ్యం? కొన్ని శాకాహార పదార్థాలను మరగబెట్టి సారాగా తయారు చేసినప్పుడు, ఆ పదార్థాల్లో లేని మత్తుగుణం ఆ ద్రవంలో ఎట్లా వస్తుందో అట్లాగే శరీరంతోపాటు చైతన్యం కూడా వస్తుందన్నారు. ఆత్మపై భౌతిక పదార్థం యొక్క అధికారాన్ని చూడడానికై మన ప్రాచీనులు చెప్పిన విషయాలలో ఇది చాలా ముఖ్యమైనది.

ఆధునిక పండితులకు లోకాయత దర్శనమంటే అభిమానం లేకపోవడం వలన, కేవలం నామమాత్రంగా మిగిలిపోయిన ఈ దర్శనాన్ని తిరిగి నిర్మించడానికి కావలసిన కృషి చేయడానికి ఆసక్తిలేదు. ఉదాహరణకు :

జయంతుడు చార్వాకులను గురించి చెబుతూ వారు- 1. సుశిక్షిత చార్వాకులనీ, 2. ధూర్త చార్వాకులనీ - రెండు రకాలని చెప్పినాడు. జయంతుడు వాడిన పదాలను ఆధారం చేసుకొని ధూర్తచార్వాకులు అనుమాన ప్రమాణాన్ని నిరాకరించారనీ,సుశిక్షిత చార్వాకులు అనుమాన ప్రమాణాన్ని అంగీకరించినారనీ,కొందరు ఆధునిక పండితులు చెప్పినారు. ఈ విభజనను అందరూ అంగీకరించినప్పటికినీ,

భారతీయదర్శన వాఙ్మయంలో మనకు ఈ విభజనను గురించిన ఆధారాలు అంతగా కనిపించడంలేదు. జయంతుడు చెప్పిన విషయాలు దీన్ని నిర్ధారించలేవు. ఎందుకంటే జయంతుడు "సుశిక్షితతర" అని వాడినాడేకాని, "సుశిక్షిత"[1] అని వ్రాసలేదు. ఇదే పదాన్ని, అంటే 'సుశిక్షిత' అనే పదాన్ని ప్రభాకర మీమాంసా దర్శనాన్ని విమర్శించేటప్పుడు జయంతభట్టు వాడినాడు.

## లోకాయతులపై నిందలు - హత్యలు

చార్వాకులు చెప్పిన నైతిక విలువలను గురించి కూడా చులకనగా మాట్లాడటం జరిగింది. అందుకే వీరిని "సుఖవాదులు" అన్నారు. మరికొందరు వీరిని 'భౌతిక సుఖవాదులు' అన్నారు. భౌతికవాదాన్ని గురించి ఎంగెల్స్ ఈ విధంగా చెప్పినాడు: అతిగా తినడం, అతిగా త్రాగడం, కళ్ళల్లో కామం, శారీరక కామవాంఛా తీవ్రత, గర్వం, కాముకత్వం, దురాశ, పేరాశ, పీనాసితనం, లాభవాంఛ, దోపిడీ"-మొదలగునవన్నీ భౌతికవాదాన్ని సూచిస్తాయని పాలస్తీనావాసి భావిస్తాడు. ఇటువంటి దృక్పథమే లోకాయతుల్లో కూడా ఉన్నదన్నారు. కాని లోకాయతుల దృక్పథం దీనికి భిన్నంగా ఉన్నదని చూపడానికి కావలసినన్ని నిదర్శనాలున్నాయి. మహాభారతంలో శాంతిపర్వంలో ఉన్న విషయాన్ని యిక్కడ ఉదహరిద్దాం.

కురుక్షేత్ర యుద్ధానంతరం విజయగర్వితులై పంచపాండవులందరూ తమ అంతఃపురానికి తిరిగి వస్తున్నప్పుడు వీరిని ఆశీర్వదించడానికై అనేకమంది బ్రాహ్మణులు రాజద్వారంవద్ద గుమికూడినారు. అప్పుడు వారిలో చార్వాకుడు ఒకడు ముందుకువచ్చి యుధిష్ఠిరుని ఉద్దేశించి ఈ విధంగా అంటాడు : "నీవు నీ సహోదర భృత్యఅమాత్యాదులందరినీ హతం చేసినావని ఈ బ్రాహ్మణులందరూ నిన్ను శపించడానికై ఇక్కడికి వచ్చినారు. నీ బంధుజనాన్ని అందరినీ చంపి నీవు పొందిందేమిటి?" చార్వాకుడు ఈ విధంగా చెప్పేటప్పటికి అక్కడున్న బ్రాహ్మణోత్తము లందరూ ఆగ్రహించినారు. దిగ్భ్రాంతులైన ఆ బ్రాహ్మణోత్తములను చూచి, అతి వ్యథ చెందిన యుధిష్ఠిరుడు తనకు ఆత్మహత్య శరణ్యమని భావించి, ప్రాణత్యాగానికి సిద్ధపడతాడు. అప్పుడు కొందరు బ్రాహ్మణులు తెప్పరిల్లినవారై యుధిష్ఠిరునితో ఈ విధంగా అంటారు : 'ఈ చార్వాకుడు, మహామోసకారియైన రాక్షసాధముడు. బ్రాహ్మణ వేషంలో వచ్చాడు. వీణ్ణి వధించాలని చెబుతూ అందరూ కలసి అతన్ని చంపుతారు.

మాయా వేషంలో ఉన్న రాక్షసులే చార్వాకులనే కట్టుకథతో భౌతికవాదమంటే ప్రజలకు భయం కలిగేటట్లు చేశారు. ఐతే, ఈ కథలో సుఖవాదానికి సంబంధించిన అంశం ఏదీలేదు. యుధిష్ఠిరుడు, అతని తమ్ములు కలసి చేసిన ఘోర

దారుణ చర్యలను చార్వాకుడు బాహాటంగా చాటినాడు. కురుక్షేత్ర సంగ్రామంలో జరిగింది కూడా ఇదే. బంధువులు, తోబుట్టువులు, ఆచార్యులు, మిత్రులు—వావి వరుసలు లేకుండా అందరూ వధింపబడినారు. ఆటవిక జాతివారియొక్క నైతిక జీవన విధానమంతా ఈ యుద్ధం తుడిచివేసింది. చార్వాకుడు ఈ విషయాన్ని ధైర్యంగా చెప్పినాడు. కాని అతన్ని దగ్ధం చేసినారు. యుద్ధం వలన నూతనంగా ఏర్పడిన పరిస్థితులను సమర్థించడానికై, ఆ రోజుల్లో ఉన్న నైతిక విలువలను మార్చివేసి కొత్తవి చెప్పవలసి వచ్చింది. ఇదంతా భగవద్గీతలో చెప్పటం జరిగింది. కురుక్షేత్ర సంగ్రామారంభంలో భయభ్రాంతుడైన అర్జునుడు విషాద నిరుత్సాహాలతో యుద్ధవిముఖు డవుతాడు. అలాంటి అర్జునుణ్ణి యుద్ధోన్ముఖునిగా చేసి చావును గురించి భయపడనవసరంలేదని కృష్ణుడు చెబుతాడు. అది భౌతిక విషయాల చర్చ లోకి అర్జునుని తీసుకువెళ్ళి అతనికి ఆధ్యాత్మిక విషయాలను బోధించే ముందు లౌకిక విషయాలను గురించి చెప్పవలసిన అవసరం వచ్చింది. "యుద్ధంలో చస్తివా స్వర్గం లభిస్తుంది. యుద్ధంలో గెలిచావా రాజ్యం లభిస్తుంది. దాన్ని నీవు అనుభవించవచ్చు." ఇది చాలా స్పష్టంగా ఉన్న విషయం. ఏ మార్గాన్ని అవలంబించినా ప్రతి దాంట్లోను సుఖం లభిస్తుంది. సుఖవాదానికి కూడా ఇక్కడ తావున్నది. లోకాయతులను సుఖవాదులని నిందించేవారే అనుకోకుండా భగవద్గీతలో సుఖవాదాన్ని చెప్పినారా ?

## భౌతికవాదం గురించి వక్రభాష్యం

భౌతికవాదమంతా కేవలం సుఖవాదమని చెప్పేదాన్ని నిరాకరిస్తూ వారు చెప్పిన ముఖ్యాంశాలను గురించి తెలుసుకుందాం. ఆచరణ దృష్ట్యా, నైతిక విలువల దృష్ట్యా చార్వాకులు కర్మసిద్ధాంతాన్ని తిరస్కరించినారు. ఇది చాలా ముఖ్యమైన విషయం.

కర్మసిద్ధాంత ప్రభావం చాలా ఎక్కువగా ఉన్నది. భారతీయ దర్శనాల్లోని అధి భౌతికవాదమంతా కర్మసిద్ధాంతంపై ఆధారపడివుంది, దానిచే పోషింపబడింది. కర్మ, పునర్జన్మనుండి విముక్తినిపొంది మోక్షాన్ని పొందాలనే ఆశయాన్ని భారతీయ దర్శనాలన్నీ కీర్తించినాయి. నాస్తిక దర్శనాలైన బౌద్ధ, జైనాలు కూడా కర్మసిద్ధాంతాన్ని అంగీకరించినాయి. కొన్ని దర్శనాలు భగవంతుని అంగీకరిస్తూ ఆయన కర్మాధ్యక్షుడనీ, కర్మఫలప్రదాత అనీ కీర్తించాయి. పురాణగాథల ద్వారానూ, హరికథల ద్వారానూ ప్రజానీకంలో ఈ సిద్ధాంతం శతాబ్దాల నుంచీ వ్యాపింపబడినందువలన దాని ప్రభావం చాలా విపరీతంగా ఉన్నది.

ఈ సిద్ధాంతంలోని అంశాలు చాలా స్వల్పం. ప్రతి కర్మకూ ఒక ఫలిత

ముంటుంది. పుణ్యకర్మలు పుణ్యాన్నీ, పాపకర్మలు పాపాన్నీ యిస్తాయి. కనుక జీవులు యిప్పుడు అనుభవించే సుఖదుఃఖాలకు కారణం పూర్వజన్మలో చేసిన సుకృత దుష్కృత కార్యాలే. మనం ఇప్పుడు చేస్తున్న కర్మలు మన భవిష్యత్తును నిర్ణయిస్తాయి. ఒక జన్మనుండి మరో జన్మకు తరలిపోయే ఆత్మ ఉన్నపుడే ఇదంతా సాధ్యమవుతుంది. ఎందుకంటే, ఈ లోకంలో కొందరు పుణ్యాత్ములు బాధలు పడటాన్ని, కొందరు పాపాత్ములు సుఖపడటాన్ని మనం చూస్తున్నాము. మరి యిది ఎట్లా సాధ్యం? పునర్జన్మ, పరలోక వాదాలను సహాయంగా తీసుకొని కర్మ సిద్ధాంతం ఈ సమస్యను సాధించినట్లు కనిపిస్తుంది. పుణ్యకార్యాలు ఇక్కడ ఇప్పుడే ఫలితాలను ఇవ్వకపోయినట్లయితే పరలోకంలోగానీ లేదా మరో జన్మలో కాని వాటి ఫలితాలను అవి తప్పక యిస్తాయనీ, ఆ ఫలితాలను జీవుడు అనుభవించి తీరుతాడని చెప్పడం జరిగింది. అలాగే పాపకృత్యాలను చేసేవారు ఇక్కడ శిక్షను అనుభవించకపోయినప్పటికినీ, పరలోకంలో శిక్షను అనుభవించకపోయినప్పటికినీ వచ్చే జన్మలో శిక్ష అనుభవించి తీరుతారనీ చెప్పినారు. ఈ సిద్ధాంతంలో ఒక ప్రశస్తాంశమున్నది. "మన గతమంతా మనలను నిర్దేశిస్తుంది." "మనకు యిక్కడ జరిగేదంతా మన పూర్వకర్మనుబట్టి జరుగుతుందనీ, దానికి మనం లొంగిపోక తప్పదనీ" రాధాకృష్ణన్ చెప్పినారు మానవుల్లో ఉండే అసమానత్వాన్ని ఆధారంగా తీసుకొని దీన్ని సమర్థించడమైనది. హిరియన్న ఈ విధంగా వివరించినాడు : "మనం చూస్తున్న అసమానత్వాన్ని వివరించే ప్రాక్కల్పనగా కర్మసిద్ధాంతాన్ని అంగీకరించవచ్చు." అటువంటప్పుడు ఉపనిషత్తుల కాలంనుంచీ వర్ణాశ్రమ విభేదాలను వివరించడానికై కర్మ సిద్ధాంతాన్ని ఆశ్రయించవలసి వచ్చిందనడంలో ఆశ్చర్యం లేదు. ఛాందోగ్య ఉపనిషత్తు ఈ విధంగా చెబుతుంది: "ఎవరైతే ఇక్కడ మంచి కర్మలు చేస్తారో వారు బ్రాహ్మణ గర్భానకానీ, క్షత్రియ గర్భానకానీ, వైశ్య గర్భానకానీ పుట్టే అవకాశమున్నది. కాని ఎవరైతే చెడు కర్మలు చేస్తారో వారు సనక, సూకర, చండాల గర్భాలయందు పుట్టే అవకాశమున్నది." గీతలో కూడా "గుణకర్మ విభాగశః" అని వున్నది.

## కర్మ సిద్ధాంతం

ఇటువంటి సాంప్రదాయ పరిస్థితుల్లో లోకాయతులు మాత్రమే ఈ కర్మ సిద్ధాంతాన్ని ఖండించినారు. స్వభావవాదాన్ని వీరికి అంటగట్టడాన్ని యిదివరకే చూచినాము. అలా స్వభావవాదాన్ని అంగీకరిస్తే, కర్మవాదానికి తావుండదని గుణరత్నుడు భావించినాడు. "అన్యే పునరాహుః మూలతః కర్మైవనాస్తి. స్వభావ సిద్ధః సర్వో ప్యయమ్ జగత్-ప్రపంచ ఇతి" అంటే, కర్మ లేదని కొందరు భావిస్తారు. నానాత్వాన్ని, భిన్నత్వాన్ని కలిగివున్న ఈ ప్రపంచమంతా స్వాభావికమైన

కారణాలవలన ఏర్పడుతున్నదని అంటారు. ఆత్మను నిరాకరించిన చార్వాకులు కర్మను నిరాకరించడం సులభంగానూ, తార్కికంగానూ ఉంటుంది.

బుద్ధునికి సమకాలీనుడైన అజిత కేశకంబరుడు బహుశ అతి ప్రాచీనుడైన భౌతికవాది. ఒక బౌద్ధ గ్రంథం అతని భావాలను గురించి ఈ విధంగా చెబుతుంది.

"యజ్ఞాలుకానీ, దానం కానీ, తపం కానీ"—అట్లాంటివి ఏమీలేవు. పుణ్యకార్యాలకుకానీ, పాపకార్యాలకుకానీ ఫలితాలు వుండవు. చతుర్భూతముల కలయికచే మానవుడు ఏర్పడతాడు. అతను చనిపోయినపుడు పృథ్వి అంశం పృథ్విలోనూ, నీటి అంశం నీటిలోనూ, అగ్ని అంశం అగ్నిలోనూ, వాయువు అంశం వాయువులోనూ, ఇంద్రియాలు ఆకాశంలోనూ కలసిపోతాయి. చనిపోయిన వాడిని నలుగురూ మోస్తూ, నిప్పును మరొకరు తీసుకువెళ్తూ స్మశానం చేరిందాకా ఆ చనిపోయినవాణ్ణి గురించి కొంత స్తుతిస్తారు. అక్కడ ఎముకలే మిగులుతాయి. మిగతాదంతా కాలి బూడిద అవుతుంది. దానాలు, ధర్మాలు అని చెప్పేదంతా తెలివి తక్కువతో కూడి వున్నది. వీటివలన లాభమున్నదని చెప్పేదంతా శుద్ధ అబద్ధం. మూర్ఖులు, ప్రజ్ఞావంతులు అందరూ ఒకే రీతిగా కాలి మసైపోతారు."

అదే కాలానికి చెందిన 'పాయశి' అనే మరొక భౌతికవాదిని యువరాజుగా జైన, బౌద్ధ గ్రంథాలు చెప్పినాయి. "పాయశి సుత్తాంత" అనే బౌద్ధ గ్రంథం, "రాయవ శేణైజ్జ" అనే జైన గ్రంథం ఇతని సిద్ధాంతాన్ని ఖండిస్తూ అతను కాలక్రమేణ బౌద్ధునిగనూ, జైనుడిగానూ మారినట్లు తెలుపుతున్నాయి. "పాయశి సుత్తాంత" లో ఇతని భావాల సమీక్ష ఈ విధంగా ఉన్నది : "పరలోకం లేదు. జన్మనిచ్చిన తల్లిదండ్రులవలన తప్ప మరొక రకంగా జీవులు పుట్టరు. పాప-పుణ్య కర్మలకు ప్రత్యేకమైన ఫలితాలులేవు." ఆ కాలంలో కర్మను గురించి, ఆత్మను గురించి తీవ్రంగా వాదోపవాదాలు జరుగుతున్నప్పుడు 'పాయశి' వీటిని ఎలా నిరాకరించింది జైన బౌద్ధ గ్రంథాల ద్వారా మనకు తెలుస్తున్నది. "పాయశి సుత్తాంత" లో ఈ విధంగా ఉన్నది :

## పరలోకం లేదు కర్మ సిద్ధాంతం తప్పు

"నాలాంటి రక్తాన్నే పంచుకొని పుట్టిన అనేకమంది బంధువులు, మిత్రులు నాకు ఉన్నారు. వారందరూ దొంగతనాలు, దోపిడీలు, ఖూనీలు, జారత్వం, వ్యభిచారం మొదలైన పనులెన్నో చేసినారు. వాళ్ళు శారీరక రుగ్మతకు లోనయినారు. దాన్నుంచి వాళ్ళు తేరుకోలేరని నాకు తెలిసినప్పుడు, నేను వారివద్దకు వెళ్ళి యీ విధంగా చెప్పినాను : కొంతమంది బ్రాహ్మణులు, పరివ్రాజకులు నీతిమార్గ మున్న

దనీ, ఆ నీతిని తప్పి ప్రవర్తించినట్లయితే మరణానంతరం పాపజీవులుగా పుడతారనీ చెప్పినారు. మీరు నైతికమార్గాన్ని తప్పి జీవించినారు కాబట్టి ఆ బ్రాహ్మ ణులు చెప్పినట్లుగా మీరు అధోపతనమైపోతారు. అట్లాగనుక మీరు అధఃపతనానికి పోయినట్లయితే, మీరుకానీ, మీలో ఎవరో ఒకరుకానీ లేదా ఎవరిచేతనైనాకానీ మీరు ఆ విధంగా పతనం చెంది నరకబాధలు అనుభవిస్తున్నామని నాకు తెలుపండి. మీరు నాకు చాలా నమ్మకస్తులు. కాబట్టి నేను ఆ విషయాలను నమ్ముతాను. వారందరూ నేను చెప్పినదానికి అంగీకరించినారు. కాని వాళ్ళలో ఎవరూ చనిపోయిన తర్వాత తిరిగి రానూ లేదు. వార్తాహరుని కూడా పంపలేదు. కనుక పరలోకం లేదనీ, పున ర్జన్మ లేదనీ, కర్మఫలితం లేదనీ తెలుస్తున్నది."

అలాగే పుణ్యజీవులైన వారుకూడా పాయశికి బంధుమిత్రులుగ నుండిరి' వారు కూడా పుణ్యకర్మల ఫలితం ఎట్లా వుంటుందో పాయశికి చెబుతామన్నారేగాని' చనిపోయిన తర్వాత ఎవ్వరూ తిరిగివచ్చి వాటిని గురించి చెప్పలేదు.

కర్మ సిద్ధాంతాన్ని గురించి పాయశి అవహేళనగా చెప్పినాడు.

పుణ్యజీవితాన్ని గడిపే బ్రాహ్మణులు, పరివ్రాజకులు మరణమంటే భయ పడుతున్నారేకాని—దాన్ని ఎవ్వరూ ఆహ్వానించలేదు. చనిపోయినట్లయితే—అంటే, మరణానంతరం సుఖప్రదమైన పరలోకపు సుఖాలు లభిస్తాయని ఈ పుణ్యా జీవులు నిజంగా భావిస్తే, వాటిని వీరు నిజంగా నమ్మితే, వారు విషం త్రాగో, లేక కత్తితో కోసుకొనో పొడుచుకొనో చనిపోయి, స్వర్గసుఖాలను ఎందుకు పొందరు. మరణా నంతరం ఏమి అవుతుందో తెలియదు కాబట్టి వారికి మరణమంటే భయమే గాక, ప్రాణమంటే తీపి కూడా ఉన్నది. అందువలన కార్మకానీ, కర్మఫలంకానీ, పుణ్య పాపాదులు కానీ, ఆత్మ కానీ లేవని తెలుస్తున్నది.

అంతేగాకుండా బ్రాహ్మణుల సిద్ధాంతాన్ని అపహాస్యంగా చిత్రించడం చార్వాకులకు చాలా ఆసక్తిదాయకంగా ఉంటుందనే విషయాన్ని "సర్వదర్శన సంగ్రహం"లో కూడా చూడవచ్చు.

"చనిపోయినవారికి శ్రాద్ధకర్మ తృప్తిని కలిగిస్తే, ప్రయాణీకులకు కావలసిన సరంజామా అంతా వారికే యివ్వవలసిన పనిలేదు.

"చనిపోయినవారు శ్రాద్ధకర్మల్లో ఇచ్చే పిండాలవలన తృప్తిపడేటట్లయితే, ఇంటి కప్పుమీద ఉన్నవారికి, క్రింద భోజనం పెట్టి తృప్తిపడమని చెప్పరాదా ?"

రామాయణంలో జాబాలి కూడా ఇదే విధంగా రాముడితో చెబుతాడు :

"ఒకరు తిన్న అన్నం మరొకరికి పుష్టినిస్తుందా? అట్లాంటప్పుడు బ్రాహ్మణుడు తిన్న అన్నం చనిపోయినవారికి తృప్తినికానీ, పుష్టినికానీ ఇస్తుందా? స్వార్థపరులైన పురోహితులు అతి చతురతతో వీటిని సృష్టించినారు.

"దానాలు చేయమనీ ధర్మం చేయమనీ, పరలోక సుఖం కోసం ఈ లోకాన్ని వదలివేయమనీ చెప్పినారు."

పాయశి వాదనలను తిరిగి చూద్దాము. ఇక్కడ నాలుగు రకాలైన వాదాలు కనిపిస్తాయి. ఆరోజుల్లో ఆచరణలో ఉన్న క్రూరమైన శిక్షను సూచించడమేకాక, ప్రయోగాత్మకమైన మిచ్చేవారని కూడా తెలుస్తున్నది.

"ఘోర దారుణ హత్యలు చేసినవాళ్ళని కాళ్ళు చేతులు కట్టివేసి తీసుకొని వచ్చి, విచారణచేసి అతనికి మరణశిక్ష విధించినప్పుడు, అతన్ని ఒక పెద్ద జాడీలో పెట్టి, మూతపెట్టి సీలువేసి ఆ జాడీని మంటలోవేసి, కాల్చిన తర్వాత, అతను చనిపోయినాడని తెలిసిన తర్వాత జాడీ మూతను తీసిచూస్తే ఏదైనా బయటకు వస్తున్నట్లు కనిపిస్తే ఆత్మ ఉన్నదని తెలుసుంది. కాని అట్లా ఏదీ బయటకు రావడం లేదు కనుక శరీరం తప్ప మరొకటి ఏమీలేదు."

## ఆత్మ లేదనిచెప్పే మరొక ప్రయోగం

మరొక ప్రయోగం వలన కూడా ఆత్మ లేదని తెలుస్తున్నది. "దారుణ కృత్యాలు చేసినవాడిని మరణశిక్ష విధింపబోయే ముందు తూచాలి. అతను మరణించిన తర్వాత కూడా తూచాలి... ఆత్మ కనుక శరీరంలో ఉండి, మరణానంతరం శరీరాన్ని వదలి పోయినట్లయితే, శరీరం బరువు తగ్గాలి. కాని మరణానంతరం శరీరం బరువు పెరగడాన్ని చూస్తాము. అందువలన, ఆత్మ, కర్మ, పరలోకం లేదని తెలుస్తున్నది."

అంతేగాక, "క్షమించరాని నేరాలు చేసినదానిని అడ్డంగానూ, నిలువుగానూ, కోసి చూచినప్పుడు ఆత్మ బహిర్గతమైతే ఆత్మ ఉన్నట్లు, అట్లా బహిర్గతం కాక పోతే ఆత్మ లేనట్లు తెలుస్తుంది."

ప్రాచీన భౌతికవాదులు తమ సిద్ధాంతాన్ని ఏవిధంగా సమర్థించింది యీ దృష్టాంతాలన్నీ తెలుపుతాయి. ఆధునిక భౌతికవాది తన సిద్ధాంత నిరూపణకు యిటువంటి వాటిపై ఆధార పడనవసరం లేదు. వైజ్ఞానిక పద్ధతులద్వారా తన సిద్ధాం న్ని సమర్థించడానికి కావలసిన విషయాలను సమకూర్చుకోగలడు. ఐతే, ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒకటి ఉన్నది. ఆధ్యాత్మికవాదము, భావవాదం ప్రబలంగా ఉన్న ఆ రోజుల్లో భౌతికవాదులు తమ దృక్పథాన్ని స్పష్టంగానూ, నిర్భయంగానూ చెప్పగల్గిరి.

"ఉపనిషత్తులను శ్రుతి ప్రమాణమని భావించడం వలన భారతీయ దర్శన పురోభివృద్ధికి ఆటంకం కలిగిందని" వింటర్‌నిట్జ్ చెప్పినాడు. జగన్మిథ్యా భావ వాద దృక్పథాన్ని పెంచదంవలన విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి ఆటంకం ఏర్పడింది. భౌతికవాదుల వాఙ్మయం లభించకపోవడం కూడా చాలా దురదృష్టకరమైనదే. అందు వలన వైజ్ఞానిక దృక్పథం క్షీణించిపోయి ఆధ్యాత్మవాదం ప్రబలమైనదిగా తయారయింది.

అందువలన చెదిరిపోయిన భౌతికవాదాన్ని అవశేషాలుగా మిగిలిన యీ చార్వాక దర్శనం నుండి తిరిగి నిర్మించవలసిన అవసర మున్నది. ఐతే, భౌతికవాద మంటే విముఖత్వ మున్న వారు దాన్ని తిరిగి నిర్మిస్తే కొన్ని యిబ్బందులుంటాయి. లోకాయత మతాన్ని గురించి పూర్వపక్షంగా మాత్రమే మనకు సమాచారం లభిస్తుంది. భారతీయ దర్శన శాస్త్రాన్ని రచించిన ఆధునికుల్లో కొందరు లోకాయత మీద తమకున్న పూర్వ భావాల దృష్ట్యా దానికి తీరని లోటును కలిగించారు.

ఈ రోజుల్లో భౌతికవాదానికి కొంత ప్రాణప్రతిష్ట జరుగుతున్నది. కోల్పోయిన బలాన్ని పుంజుకొంటున్నది. ఇది యాదృచ్ఛికంగా మాత్రం జరగటంలేదు. లోకాయతమంటే కేవలం భౌతికవాదం కాదు. అది: "లోకేష ఆయతః లోకాయత." ఇది జనాదరణను పొందిన సిద్ధాంతం. భారతీయ దర్శనశాస్త్రమంతా ఆధ్యాత్మవాద మని గొంతు చించుకొని పెద్దగా చెప్పినప్పటికినీ, భారతీయ ప్రజలు భౌతికవాదానికి కూడా వారసులు. వైజ్ఞానిక దృక్పథంతో దీన్ని అభివృద్ధి చేయవలసిన అవసర మున్నది. ప్రాచీన భారతీయ భౌతికవాదంలోని ప్రాథమిక సత్యాన్ని, అపారమైన ఉన్నత స్థాయిలోనే కావచ్చు పునఃసృష్టి చేయాల్సిన అవసరమున్నది.

# దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ విశిష్ట రచనలు

దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ రచించిన "భారతీయ తత్వశాస్త్రం - సులభ పరిచయం" అన్నది ఆయన రచనలలో విశిష్టమైనది.

సామాన్యులకు కూడా అర్థమయ్యే రీతిలో భారతీయ తత్వశాస్త్రంలోని అనేక అంశాలను వారు ఈ గ్రంథంలో తెలియజేశారు. అందులో భావవాదం, భౌతిక వాదం, వేదం - వేదాంతం, లోకాయత తదితర భాగాలను యిందులో సంక్షిప్తంగా యిస్తున్నాం.

—సంపాదకవర్గం

# భావవాదం - భౌతికవాదం

ఎంగెల్స్ ఇలా చెప్పినాడు :

"మానవుని ఉనికికి, అతని ఆలోచనకు మధ్య గల సంబంధాన్ని గురించి చెప్పడమే తత్వశాస్త్రం ముఖ్యసమస్య. అతి ప్రాచీనమైన రోజుల్లో స్వప్నంలో తాను చూచే విషయాల వలన భయభ్రాంతుడైన మానవుడు తన ఆలోచన, ఇంద్రియాల వలన లభించే జ్ఞానం శారీరకమైన చర్యల ఫలితం కాదనీ, అవి శరీరానికి భిన్నంగా ఉండే ఆత్మకు వర్తిస్తాయనీ భావించినాడు. మానవ శరీర నిర్మాణాన్ని గురించి, అది పనిచేసే విధానాన్ని గురించి ఏమీ తెలియని రోజుల్లో అలా భావించడం జరిగింది. ఆత్మ శరీరంలో నివసిస్తుందనీ, మరణానంతరం శరీరాన్ని వదలివేస్తుందనీ భావించారు. అప్పటినుంచీ ఆత్మకు- శరీరానికి గల సంబంధాన్ని చర్చించి మానవులు ఆలోచించడం మొదలు పెట్టినారు. ఈ సంబంధాన్ని చర్చించి, దానికి సమాధానం చెప్పిన దార్శనికులు రెండు వర్గాలుగా చీలిపోయారు. 1. ప్రకృతిపై ఆత్మ ఆధిక్యాన్ని అంగీకరించిన వారు. వీరిని భావవాదులు అన్నారు. 2. ఆత్మను నిరాకరించి ప్రకృతి ఆధిక్యతను గుర్తించినవారు అనేకమైన భౌతికవాదులుగా చీలిపోయారు.

ఐరోపా దర్శనంలో ప్రకృతిపై ఆత్మ ఆధిక్యాన్ని అంగీకరించిన ప్రథమ తాత్త్వికుడు ప్లేటో. భౌతికవాదానికి విరుద్ధంగా ఆయన "భావసిద్ధాంతాన్ని" రూపొందించినాడు. "సోఫిస్ట్" అనే గ్రంథంలో ఈ విధంగా వ్రాసినాడు: "ఎందుకు-సత్తాను గురించిన వివాదం దేవతలు- రాక్షసుల మధ్య యుద్ధం వంటిది." రాక్షసులు భౌతికవాదులు, దేవతలు భావవాదులు. ప్లేటో కూడా భావవాదే. మన ప్రాచీన భావవాదులు కూడా ఇదే భావాన్ని వ్యక్తం చేసినారు. వారు కూడా, భౌతిక దర్శనానికి వ్యతిరేకంగా, వారి దర్శనాన్ని అభివృద్ధి చేసినారు. వారి భావవాదం దైవశాస్త్ర మయితే, భౌతికవాదాన్ని అసుర విద్యగా భావించినారు.

దీన్ని స్పష్టంగా తెలిపే కథ ఒకటి ఛాందోగ్యఉపనిషత్తులో వున్నది. దేవతలకు- రాక్షసులకు ప్రతినిధి ఐన ఇంద్రుడు, విరోచనుడు ప్రజాపతిని సమీపించి ఆత్మజ్ఞానాన్ని గురించి చెప్పమని ప్రాధేయ పడినారు. అప్పుడు ప్రజాపతి స్వచ్ఛమైన నీటిలో వారి ప్రతిబింబాలను చూచుకోమని సలహా ఇస్తాడు. ప్రజాపతి

యిచ్చిన సలహా ప్రకారం వారిద్దరు వారి ప్రతిబింబాలను చూచుకొన్నప్పుడు నఖశిఖ పర్యంతం వారికి తమ స్వంత రూపం కనిపించింది. ఆత్మ జ్ఞానమంటే శరీరాన్ని గురించి తెలుసుకోవడమనే భావంతో విరోచనుడు సంతృప్తిచెంది వెళ్ళి పోయాడు. అందుకే దీన్ని అసుర విద్య అన్నారు. ఇంద్రుడు దానితో సంతృప్తి పడక మళ్ళీ ప్రజాపతి వద్దకు వస్తాడు. అందుకే దాన్ని "దేవ విద్య" అన్నారు. అసురులకు అవిద్యను, అంధకారాన్ని ప్రజాపతి ఇచ్చినట్లు శతపథ బ్రాహ్మణంలో ఉన్నది. దేవతల గురువగు బృహస్పతి అసురులను మోసగించడానికై రాక్షస గురువైన శుక్రుడుగా మారి అసత్యమైన తత్వాన్ని వారికి చెప్పినట్లు మైత్రి ఉపనిషత్తులో ఉన్నది.

## పరలోకం లేదు

ఇదంతా ఒక కట్టుకథ కావచ్చు. కాని ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒకటి వున్నది. ఉదాహరణకు, చార్వాక లోకాయత దర్శనమంటే ప్రజల్లో భయాన్ని కలిగించడానికై విష్ణుపురాణం ఈ కథలను బాగా వినియోగించుకొన్నది. అలాంటప్పుడు ఉపనిషత్తులు ఎంత ప్రాచీనమైనవో, భౌతికవాదం కూడా అంతే ప్రాచీనమైనదని అంగీకరించవలసి వుంటుంది. ఏది ఎలాఉన్నా, ఉపనిషత్తులోవున్న భౌతికవాదాన్ని ఆ రోజుల్లో వున్న భావవాదులు నిరాకరించారని మనకు తెలుస్తున్నది. ఉదాహరణకు పరలోకం లేదనే వాదం కఠోపనిషత్తులో వున్నది. పంచమహాభూతాలే అన్నింటికీ కారణమనీ శ్వేతాశ్వతర ఉపనిషత్తులో వున్నది. ఈ సాక్ష్యాధారాలన్నింటినీ ఒకచోట ప్రోగుచేస్తే, ప్రాచీనమైన భౌతికవాదం ఒకటి వున్నదనీ, అది తర్వాత లోకాయత మతంగా వ్యవహరించబడిందనీ మనం చెప్పవచు.

కార్య కారణవాదాన్ని ఆ దర్శనంలోని ముఖ్యమైన వైఖరిగా చెప్పవచ్చు. శ్వేతాశ్వతర ఉపనిషత్తులో చెప్పినట్లుగా ప్రతిదానికి "దానిస్వభావమే" కారణమని వీరు చెప్పినారు. రకరకాలైన వస్తువుల్లో నిగూఢంగా వున్న శక్తే స్వభావమని శంకరుడు చెప్పినాడు. ఈ దృక్పథాన్ని వివరిస్తూ కొన్ని పద్యాలు ఆ రోజుల్లోనే ప్రచారంలో వున్నాయి. అటువంటి పద్యం ఒకటి అశ్వఘోషుని రచనల్లో కనిపిస్తుంది.

"ముల్లును పదునుగా ఎవరు చేశారు ?
మృగాలు, పక్షులు అంత భిన్నంగా ఎందు కున్నాయి ?
చెరుకులో తీపి, వేపలో చేదు ఎట్లావచ్చింది ?
ఇవన్నీ వాటి స్వభావంవల్ల వచ్చినాయి"
మాధవాచార్యుడు మరొక పద్యాన్ని పేర్కొన్నాడు:

"నిప్పు వేడిగా ఉంటుంది, నీళ్ళు చల్లగా వుంటాయి.
ఉదయపు పిల్లగాలి హాయిగానూ, ప్రశాంతంగానూ ఉంటుంది.
వీటిలో ఇన్ని రకాలు ఎలా ఏర్పడ్డాయి ?
వాటి స్వభావం వల్లనే అవి అల్లా ఏర్పడ్డాయి."

ఇవిగాక, మహాభారతంలో ఉన్న నిదర్శనాలను ఆధారంగా తీసుకొని, 'స్వభావవాదాన్ని' 'యదృచ్ఛవాదంతో' పోలుస్తూ, స్వభావవాదాన్ని గురించి హిరియన్న ఈ విధంగా వివరించాడు:

## అతీతమైన శక్తుల నిరాకరణ

"ఈ ప్రపంచం అంతా సంకుల స్థితిలో ఉన్నదనీ, ఇందులో ఏ విధమైన క్రమం కనుక ఉన్నట్లయితే అది అకస్మాత్తుగా ఏర్పడిందని యదృచ్ఛవాదం తెలుపుతుంది. ఐతే, స్వభావవాదం మరొక రకంగా ఉన్నది. వాటి స్వభావంచేత వస్తువులు తయారయినట్లుగా స్వభావవాదం చెబుతుంది. యదృచ్ఛవాదం కార్య కారణ వాదాన్ని నిరాకరిస్తుంది. స్వభావవాదం, కార్యకారణవాదంయొక్క సార్వత్రి కతను అంగీకరించటమే గాక, వస్తువుల్లో జరిగే మార్పంతా ఆ వస్తువులోనే వుండే దానివల్లనే జరుగుతుందని చెబుతుంది. మనం నివసించే ప్రపంచం క్రమ రహితమైనది కాదు. కాని, ప్రపంచానికి అతీతంగా మాత్రం ఏదీ ఉండదని స్వభావ వాదం గుర్తిస్తుంది. అంతేగాక, ఆత్మనుకూడా అది నిరాకరిస్తుంది. ఈ విషయాన్ని గమనించడం చాలా ముఖ్యం. ఈ సందర్భంలో యీ సిద్ధాంతాన్ని అమృతాత్మను అంగీకరించిన ఆధ్యాత్మికవాదంతో పోల్చి చూడాలి. మహాభారతంలోని ఏ అధ్యా యాన్ని ఆధారం చేసుకొని మనం ఈ విషయాలను చెబుతున్నామో, ఆ అధ్యా యంలో 'జీవులకు మరణమే అంత్యదశ' అని ఉన్నది. అతీతమైన శక్తులను నిరాకరించడమే ఈ వాదంయొక్క ముఖ్యాశయం. దీనికి ఉప సిద్ధాంతంగా కర్మ నిరాకరణను స్వభావవాదం అంగీకరిస్తుంది.

ఇవన్నీ నిక్షిప్తార్థాలుగా స్వభావవాదంలో ఉన్నట్లయితే, దీనికి లోకాయత దర్శనానికి ఎక్కువ తేడాలేదు. లోకాయత శబ్దానికి, స్వభావవాదానికి కొంత సంబంధమున్నట్లు హిరియన్న భావించినాడు. ఏది ఎలవున్నా, వేదాంతులైన మాధవాచార్యుడు, మధుసూదన సరస్వతి మొదలైనవారు స్వభావవాదాన్ని లోకాయతులకు అంటగట్టారు. ఏ భౌతిక వాదానికి విరుద్ధంగా ఉపనిషత్తుల్లో భావ వాదం అభివృద్ధి చెందిందో, అది తర్వాత వచ్చిన లోకాయత మతం కాకపోయినా అందులోని అంశాలు కొన్ని వున్నాయి.

బహుశ ఇది ఎవరికీ అభ్యంతరంగా వుండదు. ఉపనిషత్తుల కాలంలో భౌతిక వాదానికీ—భావ వాదానికీ మధ్య వుండే స్పర్థపై అంతగా ఆసక్తిని చూపని వారే ఎక్కువమంది. ఐనా ఈ స్పర్థలో ఆసక్తికరంగా వుండే విషయాలను కొన్నింటిని గురించి తెలుసుకుందాం.

మాధవాచార్యుడు, మధుసూదన సరస్వతి స్వభావవాదాన్ని లోకాయతులకు అంటగట్టటానికి చాలాకాలం క్రిందటే, దాన్ని శంకరుడు సాంఖ్యులకు అంటగట్టినాడు. ప్రధానం లేక ప్రకృతి సహజంగా అనేకమైన మార్పులను చెందడం వలన ఏర్పడిన పరిణామం వలన ఈ ప్రపంచం పరిణతి చెందింది. ఐతే, ఈ మార్పు ఎలా సాధ్యం? సాంఖ్యుల దృక్పథాన్ని శంకరుడు ఈ విధంగా చెప్పినాడు:

"గడ్డి, మూలికలు, నీళ్ళు మొదలైనవన్నీ మరొక నిమిత్త కారణంతో ప్రమేయం లేకుండా వాటి స్వభావంవలననే ఏవిధంగా పాలరూపాన్ని పొందుతాయో అదే విధంగా ప్రధానంకూడా దానంతట అది 'మహత్తు మొదలైనవాటి రూపాల్లోకి మారుతుంది. ఏ విధమైన నిమిత్త కారణంతో ప్రమేయం లేకుండా అవి పాలుగా మారుతాయని ప్రశ్నిస్తే—'అటువంటి కారణాన్ని దేన్నీ మనం చూడం.' కాబట్టి—అవి ఆ విధంగానే మారుతాయని సమాధాన మిస్తారు. మనం అటువంటి కారణాన్ని కనుక చూచినట్లయితే, దాన్ని గడ్డి మొదలగు వాటితో అన్వయించి పాలను అధికంగా పొందవచ్చు. కాని అటువంటిదేదీ జరగడం మనం చూడలేదు. గనుక గడ్డీ మొదలైనవన్నీ సహజమైన మార్పువలననే పాలరూపాన్ని ధరిస్తున్నాయి. దీన్నిబట్టి ప్రధానంకూడా అదేవిధంగా మారుతుందని ఊహించవచ్చు."

ఈ విషయాన్ని ఖండించడానికై శంకరుడు ఇలా వాదించాడు :

"సాంఖ్యులు చెప్పిన పద్ధతిలోనే గడ్డికనుక పాలుగా మారినట్లయితే, ప్రధానం కూడా తన స్వభావం వలననే 'మహదహంకారాదుల్లోకి' మారుతుందని చెప్పవచ్చు. కాని ఒక నిమిత్త కారణాన్ని మనం చూస్తుండటం వలన సాంఖ్యుల వాదాన్ని మేము అంగీకరించం. ఎందుకంటే గోవులుగాని, గేదెలుకాని, లేదా ఆడజంతువులుకాని గడ్డిని మేసినప్పుడే అవి పాలివ్వడాన్ని మనం చూస్తున్నాం. అంతేగాని ఏ జంతువుపడితే ఆ జంతువు గడ్డి తిన్నపుడు, ఎద్దు తిన్నపుడు గడ్డి పాలుగా మారదు. ఈ మార్పుకు ప్రత్యేకమైన కారణం గనుక లేకపోయినట్లయితే, ఆవు తినకపోయినా కూడా గడ్డి పాలుగా మారాలి. అంతేగాక, మనకు కావలసినన్ని పాలను సమృద్ధిగా మనం ఉత్పత్తి చేసుకోలేమని నీవు చేసే వాదన నిమిత్త కారణం లేదనే వాదాన్నికూడా నిరూపించదు. ఎందుకంటే, కొన్ని కార్యాలు మానవ ప్రయత్నంవలన సాధ్యమవుతాయి. కొన్ని కావు. కాని వీటికి దైవసహాయం ఉంటుంది. అప్పుడు అవి లభ్యమవుతాయి. ఐతే, యధార్థ మేమిటంటే, తమ

ఆధీనంలోవున్న ప్రక్రియలద్వారా మానవుడుకూడా కొన్నింటిని సాధించగలుగు తాడు. గోవును సరిగ్గా పోషిస్తే, పాలు సమృద్ధిగా ఉత్పన్నమై మనకు అధికంగా లభిస్తాయి. ఈ కారణాలవల్ల 'సాంఖ్యుల ప్రధానం' అయత్నంగా మార్పు చెందు తుందనే వాదాన్ని మేము అంగీకరించ" మంటాడు శంకరుడు.

ఈ స్వభావవాద ఖండనలోని బలహీనత సుస్పష్టం. యథార్థమైన ఒక ప్రశ్నను ఇక్కడ పరిశీలించాలి. ప్రకృతిలోని పదార్థాల్లోవున్న కారణాన్ని కాక, వీటికి అతీతంగా మరొకటి ఉంటుందని చెప్పవలసిన అవసరమేమిటి? ఆడవారి శరీర అవయవ నిర్మాణం అటువంటి బాహ్యకారణాన్ని దేన్నీ నిరూపించదు. స్వభావ వాదం దృష్ట్యా గడ్డినుంచి పాలువస్తే, ఇక్కడ గడ్డి మాత్రమే కారణమని అర్థం చేసుకోకుండా, గోవు గడ్డిని తినడం మొదలు అందులో వుండే ప్రతి రసాయనిక చర్యను దృష్టిలో ఉంచుకోవాలి. గోవును బాగా పోషించడం వలన పాలు అధికంగా ఇస్తుందనే వాదంద్వారా ప్రకృతేతర కారణ మున్నది కూడా నిరూపించలేం. అంతేగాక, ప్రకృతి సూత్రాలను తెలుసుకొన్నట్లయితే ప్రకృతిని జయించవచ్చనే విషయం అందులోనే ఉన్నది. ఆధునిక పరిభాషలో చెబితే, అవసరాన్ని గుర్తించడమే స్వేచ్ఛ. భౌతిక దృక్పథాన్ని వివరిస్తూ ఎంగెల్స్ అన్నాడు. "ఒక దేశాన్ని జయించిన అధిపతి ఆ దేశ ప్రజలను విదేశీయులుగా భావిస్తూ, ఆ దేశానికి దూరంగా వుండి ఏ విధంగా బరిపాలిస్తాడో, మనం ప్రకృతిని అలా పరిపాలించం. ఇతర జీవులకంటె ప్రకృతిని గురించి ఎక్కువగా తెలుసుకోవడంవలన, అలా తెలుసుకొన్నందువలన ప్రకృతిపై ఆధిపత్యాన్ని పొంది, రక్తమూ, మాంసం, మనస్సులతో కూడివున్న మనం ప్రకృతిలో ఒక భాగమని గుర్తిస్తాం."

పాల ఉత్పత్తికి, ప్రకృతికంటే అతీతమైన శక్తి అవసరాన్ని నిరూపించి నపుడే స్వభావవాదంలో ఉన్న భౌతికమైన అంతస్సారాన్ని నిరాకరించినట్లవుతుంది. అందుకే, ఈ విషయాన్ని గుర్తించిన వాచస్పతి మిశ్ర శంకర భాష్యానికి వ్యాఖ్యను వ్రాస్తూ ఈవిధంగా అన్నాడు: గడ్డి పాలుగా మారాలంటే, ఆవు జీర్ణ శక్తికాక మరొకటి అనవసరం. ఐనా, ఇందులోకూడా జ్ఞానయుతమైన కారణం కావాలి కాబట్టి, సర్వజ్ఞుడైన భగవంతుడే ఆ కారణమని అతడు సమర్థించినాడు. ప్రతీ పనిలోనూ దైవాంశం ఉంటుంది కాబట్టి ఇందులో కూడా అది ఉంటుందన్నాడు.

సాంఖ్యదర్శనానికి తిరిగివద్దాం. ఇదంతా శంకరుడు చెప్పకముందే గౌడపాదుడు ఈ విధంగా చెప్పినాడు : "సాంఖ్యానాం స్వభావనామ కశ్చిత్ కారణం అస్తి." అంటే, సాంఖ్యదార్శనికుల ప్రకారం స్వభావమనే ఒక కారణం ఉన్నది. ఐతే, వేదాంతులు ఈ స్వభావ వాదాన్ని సాంఖ్యులకే ఎందుకు అంటగట్టినారు?

అట్లా అంటగట్టకపోతే వారు సాంఖ్యుల దర్శనాన్ని అర్థం చేసుకోలేరు. తర్వాత కాలంలో సాంఖ్యులను ద్వంద్వ దర్శనకారులన్నారు. ప్రధానం, పురుషుడు— ఈ రెండూ ఈ దర్శనంలోని ముఖ్యాంశాలు. కాని పురుషుని "అప్రధానుడుగను," "ఉదాసీనుడుగను" సాంఖ్యులు చిత్రించినారు. మరోరకంగా చెబితే, ప్రకృతిలో ఉన్న స్వభావం వలన ప్రధానంలోనుంచి ప్రపంచం పరిణామం చెందగలదు. అందుకే సాంఖ్యులకు స్వభావవాదంతో ఆవశ్యకంగా అవసరమున్నదని గౌడ పాదుడు, శంకరుడు భావించినారు.

స్వభావవాదంలోని భౌతికాంతస్సారాలను హిరియన్న బహిర్గతం చేసినాడు. గౌడపాదుడు, శంకరుడు చెప్పింది కనుక నిజమయినట్లయితే, సాంఖ్య దర్శనాన్ని కూడా ఒక విధమైన భౌతిక దర్శనంగా మనం భావించవలసిందేనా ?

# వేదం - వేదాంతం

[వేదం – వేదాంతం అన్న రెండు పదాలు భారతదేశ మత తాత్విక రంగాలలో విననివారు ఉండరు. ఈ రెండు ఎలా రూపొందాయి ? వీటి అర్థం ఏమిటి ? ఋగ్వేదం, సామవేదం, అథర్వణ వేదం, యజుర్వేదం వీటి రచనా కాలం ఏది ? ఇందులో "సూక్తాలు" చెప్పేదేమిటి ? అలాగే వేదాంతం. (వేదాలకు అంతిమ భాగం) అంటే ఏమిటి ? వేదాంతంగా చెప్పబడే ఉపనిషత్తులు ఎవరెవరు రచించారు ? భారతీయ తత్వశాస్త్రంలో ఉపనిషత్తులు నిర్వహించిన పాత్ర ఏమిటి ? మున్నగు విషయాలను శ్రీ దేవీ ప్రసాద్ ఛట్టోపాధ్యాయ ఇందులో వివరించారు.]

వేద శబ్దానికి అర్థం జ్ఞానం. ఆస్తికులు దాన్ని పరమ పవిత్రంగా భావించి అది భగవద్దత్తమైన ప్రామాణ్య గ్రంథ మంటారు. కాని, ఇందులోని విషయాలను గనుక పరిశీలించి నట్లయితే, ఇది అనేక కాలాల్లో అనేకమంది చెప్పిన విషయాల సముదాయంగా ఉంటుంది. కనుక దీని శైలిలో కాని, రచనా పద్ధతిలోని తీరులో కాని ఒకే రీతి ఉన్నట్లు కనిపించదు.

ఈ రచనల్లో అతి ప్రాచీనమైనవి ఆర్యులని పిలువబడే పశువుల కాపరులు పాడిన పాటలు, చేసిన స్తుతులు ఈ రూపాన్ని దాల్చి, ఏదో ఒక అనాగరిక దశలో వాటిని జ్ఞాపక ముంచుకొని, మౌఖికంగా తర్వాత తరంవారికి అందజేయటం వలన వాటిని 'శ్రుతులు' అన్నారు. ఈ విధంగా మౌఖికంగా అందజేయబడిన అతి ప్రాచీనమైన వాటిని "మంత్రాలు" అన్నారు. మరొక భాగాన్ని "బ్రాహ్మణములు" అన్నారు. ఇవి గద్య రూపంలో వుండి తర్వాత కాలంలో ఏర్పడినాయి.

## నాలుగు సంహితలు

ఈ మంత్రాలన్నీ నాలుగు సంహితల రూపంలో మనకు లభ్యమయినాయి. అవి : ఋగ్వేద సంహిత, సామవేద సంహిత అథర్వణవేద సంహిత, యజుర్వేద సంహిత. వీటిలో ఋగ్వేదసంహిత అతి పురాతనమై మిగతా వాటికి పునాదిగా వున్నది. పరిష్కరించబడిన సంహితలు అనేకం ఒకానొకప్పుడు వున్నాయి కాని, కొన్ని మాత్రమే మనకు ఇప్పుడు లభ్యమవుతున్నాయి. మనకు ప్రస్తుతం పరిష్కృతమై లభ్యమయిన ఋగ్వేదంలో 1.028 'సూక్తా'లు ఉన్నాయి. ప్రతి 'సూక్తం' లోనూ 10 ఋక్కులు ఉన్నాయి. కనుక మొత్తం 10,552 ఋక్కులు ఉన్నాయి. గ్రంథ పరిమాణంలో ఋగ్వేదం హోమర్ గ్రంథమంత వుంటుంది.

అనేకమంది మహర్షులు (పండితులు) ఈ ఋక్కులను రచించినట్లుగా సాంప్రదాయం చెబుతుంది. వీరినే 'ద్రష్ట'లు అన్నారు. ఇవి జానపదుల పాటలను పోలి వుండడంచేత వీటిని ఎవరో కొందరు వ్రాసి వుంటారనుకోవటం పొరపాటు. ఏది ఎలా ఉన్నా, వీటన్నిటినీ పరిష్కరించి సంకలనం చేయడానికి చాలాకాలం పట్టి వుంటుంది. కనుక ఋగ్వేద కాలాన్ని ఖచ్చితంగా నిర్ణయిస్తే అది దోషంగానే వుంటుంది. ఆధునిక పండితులు చెప్పిన కాలంలో కూడా తారతమ్య మున్నది. ఇవి అతి ప్రాచీనమైన యుగానికి కానీ, లేదా అతి ఆధునిక యుగానికి కానీ వర్తిస్తాయని చెప్పడంలో వున్న ప్రమాదాన్ని గురించి వింటర్‌నిట్జి హెచ్చరిస్తూ, ఇవి క్రీ. పూ. 2500 సంవత్సరాల ప్రాంతాల్లో ఉండవచ్చునన్నారు. వేదాల ప్రాచీనతను నిర్ణయించడానికి ఒక అనువైన పద్ధతిగా దీన్ని అంగీకరించవచ్చు. ఋగ్వేదాన్ని సంకలనం చేసినవారు, భారతదేశంలో ప్రవేశించి సింధులోయ నాగరికతా చిహ్నాలైన ఆయా పట్టణాలను ధ్వంసం చేసినారనే విషయాన్ని పురాతన వస్తు తత్వశాస్త్రజ్ఞులు బాగా విశ్వసిస్తున్నారు. అనేకమైన యుద్ధాల్లో ఆరితేరిన యుద్ధ వీరుడగు ఇంద్రుని అతిశయోక్తులతో 'త్రిపురాంతకుడ'ని పొగడిన పొగడ్తలు ఋగ్వేదంలో అనేకం కనిపిస్తాయి. ఈ సింధు లోయలోనే ఆటవిక జాతి వారు నాశనం చేసిన పట్టణాల శిధిలాలు కూడా లభిస్తున్నాయి. ఈ ప్రాతిపదిక అంతిమంగా నిరూపణ ఐనట్లయితే సింధు లోయలోని పట్టణాలు శిధిలాలుగా మారిపోయిన కాలాన్ని సరిగ్గా నిర్ణయించినట్లయితే వేదకాలాన్ని కూడా ఖచ్చితంగా నిర్ణయించవచ్చు.

## ఋగ్వేదంలో ఉన్నది ఏమిటి ?

ఋగ్వేదంలోని విషయాలకు మాత్రమే మన చర్చను పరిమితం చేద్దాం. పరమ జ్ఞానానికి ఋగ్వేదం నిధి వంటిదని మనవారు చెబుతారు. అర్థం చేసుకొనే రీతిలో కనుక వేదాన్ని చదివినట్లయితే, ఆ రోజుల్లో వున్న పశువుల కాపరులు తమ కోరికలను, ఆశయాలను వ్యక్తం చేస్తూ పాడిన పాటలవలె అవి కనిపిస్తాయి. ధాన్యం, సంపద, పశువులు, ఆయువు, ఆరోగ్యం, జయం, అధిక సంతానం కావాలని వీరు ఆశించినారు. వాని ఆశయాలను పాటల రూపంలోనూ, ప్రార్థనల రూపంలోనూ, స్తుతులు, స్తవాల రూపంలోనూ వ్యక్తం చేసినారు. ఐతే, అనేక సంఘటనల ప్రభావం వలన ఋగ్వేద అధ్యయనాన్ని ధర్మశాస్త్ర కర్తలు స్త్రీలకు, బ్రాహ్మణేతరులకు నిషేధించడం చాలా శోచనీయమైన విషయం. జగత్ సృష్టిని గురించి అక్కడక్కడ చెప్పిన విషయాలు తప్ప తాత్వికమైన విషయాలను గురించి చేసిన చర్చలు వేదంలో చాలా తక్కువగా కనిపిస్తాయి. అంటే తాత్వికాలోచనా లక్షణాలు వేదంలో వున్నట్లు కనిపించవు. తర్వాత కాలపువారు దానినుంచి తాత్వికంగా గ్రహించేది ఏమీ ఉండదు. ఐనప్పటికీ, వేదమంటే మన దార్శనికులకు ఏర్పడిన

పూజ్యభావం వల్ల ఋగ్వేదంలో సారహీనంగా వున్న తాత్విక ఆలోచనా శకలాలను ఆధారంగా తీసుకొని, తర్వాత వచ్చిన దార్శనిక దృక్పథా లన్నింటికి వేదమే ఆధారమనీ, ప్రతి దర్శనానికీ వేద ప్రామాణ్య మున్నదనీ చెప్పడం జరిగింది. దీనికి ఒక ఉదాహరణ చాలు.

న్యాయ-వైశేషికులు రూపొందించిన అణువాదాన్ని సమర్థిస్తూ, 'పత్రత' అనే పదానికి అర్థం 'కదలిక' కాబట్టి, ఈ పదం ఋగ్వేదంలో ఉన్నది కాబట్టి, అణువులు కదలికను కలిగిఉన్నాయి కాబట్టి, 'అణువాద ప్రాక్కల్పన' ఋగ్వేదంలో ఉన్నదని ఉదయనాచార్యుడు చెపుతూ వేద ప్రామాణ్యాన్ని సమర్థించినాడు. ఇంతకన్నా చోద్యమైన విషయం మరొకటి వుండదు. ఉదయనుడు చెప్పిన ఈ వేదపాఠం అతి ప్రాథమికమైన దైవవాదాన్ని సూచిస్తుంది. 'పత్రత' అనే పదానికి అర్థం పక్షి అని ఉంటే, దానికి శాయనాచార్యుడు 'కదిలే పాదాలు' అని అర్థం చెప్పినాడు. ఈ వేద పాఠం అనువాదం దాదాపు ఈ విధంగా ఉంటుంది :

"ఏ దేవత చక్షువులు అన్ని దిక్కులు వ్యాపించి ఉంటాయో, ముఖం అన్ని దిక్కులా వ్యాపించి ఉంటుందో, చేతులు, కాళ్ళు అన్ని దిక్కులా వ్యాపించి ఉంటాయో- ఆ దేవత భూమ్యాకాశాలను సృజించిన తర్వాత వీటిని తన చేతులతోనూ, కాళ్ళతోనూ ఆదేశిస్తుంది."

## ఆత్మవాదం ఋగ్వేదంలో ఉందా ?

అతి ప్రాచీనమైన ఈ పాతపాటల్లో అభివృద్ధి చెందిన తమ దార్శనిక దృక్పథాలకు కావలసిన ఆధారాన్ని చూడటానికి మధ్యయుగంవారు ఎంత తహ తహ లాడే వారో చూపడానికి ఈ నిదర్శనం ఒక్కటి చాలు. ఆధునిక కాలంలో అభివృద్ధి చెందినటువంటి మత చైతన్యంగానీ లేదా ఆత్మవాదం కాని ఈ ఋగ్వేదంలోనే ఉన్నాయని చెప్పే వాదాన్ని ఎంతవరకు అంగీకరించవచ్చుననే విషయం వివాదాస్పదంగానే ఉంటుంది. ఈ ఋక్కులు, పాటలు అనేకమైన దేవతలను గురించి చేసిన విపరీతమైన స్తుతులుగా భావించవచ్చు. ఆహార ధాన్యాలను దోచుకుంటూ, పశువులను దొంగిలిస్తూ, సంపదలను కొల్లగొడుతూ, పరమ నిర్దాక్షిణ్యంతో వాటిని తమలో పంపకం చేసుకునే ఆటవిక జాతుల వీరుల స్తవాలే ఈ ఋక్కులు. వారి నాయకులను సభాంగణాల్లో 'మిత్రులని', 'పరమ మిత్రులని', 'మిత్రశ్రేష్ఠులని', 'పర్వతంలాగా స్థిరమైన వారని', 'వనస్పతివంటి వారని', 'ఆయుధంలాంటి వారని', 'ఓషధుల్లాంటి వారని'—వీరు పొగిడేవారు. కొన్ని సమయాల్లో కేవలం భౌతికమైన ఈ లోకంలోని కోర్కెల స్వభావాన్ని కూడా దేవతా స్వరూపంగా వర్ణించేవారు, ఉదాహరణకు:— 'గర్భస్రావరక్షణ దేవత', 'సంతాన దేవత' మహమ్మారిలా విరుచుకొనిపడి జననాశ

నంచేసే 'మశూచి దేవత', 'అంటువ్యాధి నివారణదేవత'—మొదలగువారు ఈ కోవకు చెందుతారు. ఈ కోవకు చెంది అత్యంతాసక్తి కలిగించే దేవత 'అన్న దేవత'. భోజనప్రియులైన ఆటవిక కవులు అన్న దేవతను గురించి అది చాలా రుచికరంగా ఉంటుందనీ, శరీరాలను బలంగా ఉండేటట్లు చేస్తుందనీ—స్తుతించి ఆరాధించినారు. మిక్కలి ఉన్నతమైన ఆత్మతత్త్వ భావాలు ఋగ్వేదంలో ఉన్నాయని సాంప్రదాయకులు, ఆధునికులు భావిస్తున్న దృష్ట్యా "ఋగ్వేదం I-187 పితృదేవత అగస్త్యుడు" అన్న సూక్తాన్ని గురించి తెలుసుకోవటం ఆసక్తికరంగా ఉంటుంది:

"నేను పితును ప్రశంసిస్తున్నాను- అతడు గొప్పవాడు, బలవంతుడు, ఉద్ధారకుడు. అతని జీవశక్తి వలననే 'ప్రసిద్ధి చెందిన' తృత, వృత్రుని అంగవైకల్యుని చేసి, చిత్రహింసలు చేశాడు. రుచివంతమైన, మధువంతమైన పితు, నిన్ను ఆహ్వానిస్తున్నాము. మా రక్షకుడవుకమ్ము - మాదగ్గరకు రమ్ము. మాకు సౌఖ్యములనిచ్చే పితు, మాకు సంతోషము నిమ్ము. అత్యంత గౌరవనీయుడైన స్నేహితుడా, అసూయ లేనివాడవు. దుమ్ము నలుదిక్కులా ఆవరించినట్లు, గాలి ఆకాశమునంతా ఆవరించినట్లు నీ బహుమానాలు అన్ని దిక్కులను ఆవరించి ఉన్నాయి. నిన్ను పంపకంచేసే ఈమనుషులు, అతిరుచికరమైన పితు, నిన్ను నీ రసమును ఆస్వాదిస్తారు. నీవలెనే పొడుగాటి మెడలతో ఉంటారు. శక్తివంతమైన దేవతల మనస్సులు, ఓ పితు, నీపైననే కేంద్రీకృతమై ఉన్నాయి. నీ క్రియాశీల సహాయం వలననే, ఇంద్రుడు అహిని నాశనం చేశాడు. ఓ పితు, పర్వతాలకు సంబంధించిన సంపద నీకే చేరుకున్నది. ఓ తీయని వాడా మా మాటలు వినవలసింది. మా భోజనానికి దగ్గరగా ఉండవలసింది. నీరు, మొక్కలు సమృద్ధిగా ఉంటే మేము సంతోషిస్తాము. కనుక ఓ శరీరమా నీవు లావుగా ఉండవలెను. ఉడకబెట్టిన యవ, కాగిన పాలతో నీవు కలిసినప్పుడు ఏర్పడే సోమరసం మాకు ఆహ్లాదం కలిగిస్తుంది. కనుక ఓ శరీరమా, నీవు లావుగా పెరుగుదువుగాక—"

## శారీరక మీమాంస

అన్న ఈ మంత్రంలో ఉన్న "వాపాతే పీవః ఇత్ భవ" అనే పల్లవి అర్థాన్ని ముఖ్యంగా గమనించాలి. ఈ శరీరం పుష్టికరంగా ఉండాలి. తుష్టిని కలిగి ఉండాలి. అనే అర్థం స్ఫురిస్తుంది. వేదాన్ని అంగీకరించి, దానితో అతి సన్నిహితమైన అనుబంధాన్ని కలిగి ఉన్న వేదాంతదర్శనం కూడా వేదంలో యథార్థంగా ఉన్న విషయాలకు ఎంత దూరంగా ఉన్నదో చూడడానికే ఈ విషయాన్ని ఇంత విపులంగా చెప్పవలసి వచ్చింది. ఈ వేదాంత దర్శనాన్నే 'శారీరక మీమాంస' అంటారు. 'శారీరక' అనే పదం 'శరీర్' అనే శబ్దంలోనుంచి వచ్చింది. ఐతే, దానికి 'కన్' అనేదాన్ని చేర్చి న్యూనతను సూచించే అర్థాన్ని చెప్పినారు. అపవిత్రమైన యీ

శరీరంలో పవిత్రమైన ఆత్మ ఉంటుందన్నారు. భోజనప్రియులై వుండి, రమ్యమైన పానీయాలను, రుచ్యమైన పదార్థాలను సేవించి, ఆటలు ఆడి పాటలు పాడుకొనే వీర్యవంతులైన ప్రాచీన పశువుల కాపరులకు 'శారీరక మీమాంస' వంటి దర్శనశాస్త్రం అర్థరహితమైనదిగా ఉంటుంది.

వేదకాలంలో అన్నదేవత (పితుః) ఒక ప్రముఖ దేవత కాదు. మిత్రుడు, వరుణుడు, ఇంద్రుడు మొదలగువారు ప్రముఖ దేవతలు. ఈ దేవతలపై ప్రాచీన భారతీయ చరిత్రను, పురాణాలను చదివేవారికి మాత్రమే ఆసక్తి వుంటుంది. వేద కాలంనాటి దేవతల్లో 'అన్నదేవత', 'గర్భస్రావ నిరోధ దేవత' మొదలగు దేవత లున్నారనేది తాత్త్వికంగా ప్రముఖమైన విషయం. వైదిక ఆలోచన ఉన్నతమైన సాధారణీకరణ స్థాయిని ఇంకా చేరవలసి వున్నదనీ, ఆధునిక దృష్ట్యా తాత్త్విక సిద్ధాంతంగా అంగీకరింపబడిన విషయాలు ఏవీ అందులో లేవని ఈ ఉల్లేఖన తెలుపుతున్నది.

## యజ్ఞం అంటే ఏమిటి ?

విలక్షణంగా ఉన్న మరొక పరిస్థితిని కూడా మనం ఇక్కడ చూడవచ్చు. తర్వాత వచ్చిన దార్శనికులు తమ సిద్ధాంతాలకు వేదమే మూలమని, విసుగూ, విరామం లేకుండా చెప్పినప్పటికినీ, వైదిక సాంప్రదాయంలో సాధారణీకరణకు తావున్నట్లు కనిపించదు. నాలుగు వేదాల్లో చెప్పబడిన నలుగురు పురోహిత బ్రాహ్మణులు చేసే యజ్ఞాల కొరకే ఈ సంహితలు ఉపయోగిస్తాయి. హోత్రు పురోహితుడు ఋగ్వేదాన్ని, ఉద్గాత్రు పురోహితుడు సామవేదాన్ని, అధ్వర్యు పురోహితుడు యజుర్వేదాన్ని, బ్రాహ్మణ పురోహితుడు అథర్వవేదాన్ని ఆధారం చేసుకొని యజ్ఞం చేస్తారు. ఈ సాంప్రదాయాన్ని నిరాకరించడానికి ఆధారం లేనందున ఈ ప్రాచీన ఋక్కుల ప్రకారం యజ్ఞమంటే ఏమిటో చూద్దాం. యజ్ఞం చేసేటప్పుడు ఈ ఋక్కులు ఏ విధంగా ఉపయోగపడతాయి ? యజ్ఞంయొక్క ప్రభావాన్ని ఇతోధికంగా పెంచడానికి, వర్షాన్ని, భాగ్యాన్ని, జయాన్ని పొందడానికి కావలసిన మంత్రవిద్యతో పాడే పాటలే ఈ ఋక్కులని గోర్డన్ చైల్డ్ అన్నాడు." ఈ ఋక్కులే గనుక మంత్రాలయినట్లయితే, తర్వాత వచ్చిన మతదృష్టిలో అవి స్తోత్రాలుగా వుండటానికి వీలులేదు. మత దృక్పథంకంటె మంత్రవిద్య యందే వైదిక ప్రజలకు ఆసక్తి ఎక్కువగా ఉండేదని తోస్తుంది. ఇతర సంహితలను, బ్రాహ్మణాలను పరిశీలించినపుడు ఈ విషయం ఇంకా స్పష్టమవుతుంది. ఈ విషయాన్ని పరిశీలించేముందు మంత్రవిద్యకూ—మతానికీ మధ్యవున్న ప్రధానమైన తేడాను గురించి తెలుసుకోవడం చాలా అవసరం.

# వేదాంతం

వేదంతో నేరుగా సంబంధాన్ని కలిగివున్న మరొక దర్శనం వేదాంతదర్శనం. ఉపనిషత్తులను వేదాంత మంటారు. వేదాలకు అంతిమ భాగంగా ఉపనిషత్తులు వున్నందువలన వాటిని వివరించే దర్శనాన్ని వేదాంత దర్శన మన్నారు. వేదాంతు లందరూ, ఉపనిషత్తుల్లో వున్న తాత్త్వికాంశాలను స్వీకరించి తన ఆలోచనా పథం లోకి చొప్పించినారు. ఈ ఉపనిషత్తుల్లో ఒకేవిధమైన తాత్త్విక భావాలు లేవు. అందు వలన వీటిపై వ్యాఖ్యలు వ్రాసినవారు వీటిలోనుండి సమగ్రమైన దర్శనాలను రూపొందించవలసి వచ్చింది. దీనికితోడు, వేదాంత సూత్రాలు లేక "బ్రహ్మ సూత్రాలు" అనే గ్రంథంలో ఈ భావాలకు సమగ్రమైన ఒక రూపాన్ని ఇవ్వడం ప్రథమంగా జరిగింది. ఈసూత్రాలను బాదరాయణుడు రచించినాడని ప్రతీతి. ఇతనిని గురించి చారిత్రకంగా ఏమీ తెలియడంలేదు. ఇవి ఎప్పుడు సూత్రాకృతిని దాల్చిందీ కూడా కచ్చితంగా చెప్పలేము. ఇవి క్రీ. పూ. 2 వ శతాబ్దంలో రూపొందినాయని ప్రొఫెసర్ దాస్‌గుప్త క్రీ.శ. 200 మొదలు 500 సంవత్సరాల్లో రూపొందినాయని జాకోబి భావించినారు.

వేదాంత సూత్రాలను మూలగ్రంథంగా వేదాంతులందరూ అంగీకరించినారు. ఈ సూత్రాలు చాలా నిగూఢంగా ఉన్నందువలన రకరకాలైన వ్యాఖ్యానాలకు అది తావిచ్చింది. బ్రహ్మసూత్రాలను ఆధారం చేసుకొని అనేకమైన వ్యాఖ్యలను వ్రాసిన వారు. వారి దృక్పథాలను సమర్థించుకోడానికై బ్రహ్మసూత్రాలను ప్రమాణ గ్రంథంగా పేర్కొన్నారు. అందువలన వీరందరూ తమ దర్శనాలకు 'వేదాంతం' అని పేరు పెట్టుకున్నారు.

## అద్వైతం లేదా మాయావాదం

బ్రహ్మసూత్రాల్లోని సూత్రార్థాలకు ఏ భాష్యం, లేక ఏ వ్యాఖ్యానం ఎక్కువ అనుగుణంగా ఉంటుంది. తద్వారా ఉపనిషత్తులకు ఏ దర్శనం దగ్గరగా వుంటుందనే ప్రశ్నను ఇక్కడ ప్రస్తావించనవసరం లేదు. ఐతే, ఏదార్శనిక దృక్ప థానికి చెందిన వ్యాఖ్య ఎక్కువ ప్రాముఖ్యాన్ని పొందిందో దానిని గురించి ప్రస్తా

విద్దాం. ఇది "అద్వైతం" గానూ "మాయావాదం" గానూ ఖ్యాతి నొందింది. ఈ అద్వైత దర్శనంలో బ్రహ్మసత్యం, జగత్తు మిథ్య, జీవుడు-బ్రహ్మ ఒక్కరే-అనేది చాలా ముఖ్యమైన సిద్ధాంతం. భౌతిక ప్రపంచం అంతా మిథ్యాస్వరూపం కాబట్టి దానికి యథార్థత లేదు. ఈ వాదాన్ని శంకరాచార్యుడు పటిష్ఠం చేసినప్పటికీనీ ఇది అతి ప్రాచీన కాలంలోనే వున్నట్లు తోస్తుంది. శంకరునికి ముందు ఆయన గురువైన గౌడపాదాచార్యుడు ఈ వాదాన్ని స్థాపించినాడు. బ్రహ్మసూత్రాలపై తను ఏ విధమైన వ్యాఖ్య చేసినట్లు కనిపించదు. "మాండూక్యకారిక" అనే గ్రంథాన్ని గౌడపాదుడు వ్రాసినాడు. దాని శబ్దార్థం మాండూక్య ఉపనిషత్తుకు భాష్య సమంగా వున్నప్పటికినీ, ఇది స్వతంత్రంగా రచించిన గ్రంథమే. శంకరుడు గొప్ప రచయిత కాబట్టి ఉపనిషత్తులకు భాష్యాన్ని, బ్రహ్మసూత్రాలపై "శారీరక భాష్యాన్ని", "గీతాభాష్యాన్ని" అద్వైతపరంగా వ్రాసినాడు. ప్రకరణ గ్రంథాలనేకం ఇతను వ్రాసినట్లు సాంప్రదాయం భావిస్తుంది. తార్కికపటిష్టత, సరళత్వం ఇతని గ్రంథాల్లో కనిపిస్తాయి. వాచస్పతి మిశ్ర, పద్మపాదాచార్యులు, సురేశ్వరాచార్యులు మొదలగువారు యితని గ్రంథాలకు భాష్యాలను, వ్యాఖ్యలను వ్రాసినారు. శంకరాద్వైతంలోని అనుకూల అంశాలను వీరు విపులీకరించినారు. ఐతే ఇతని దర్శనంలోని వ్యతిరేక ధోరణికి అతని తర్వాత వచ్చిన తార్కికులు శ్రీహర్షుడు, చిత్సుకాచార్యుడు సమగ్రమైన ఒక రూపాన్నిచ్చినారు. నిజానికి ఈ దర్శనంలో అనుకూలాంశాల కంటే వ్యతిరేకాంశాలే ఎక్కువ. అద్వైతాన్ని వివరిస్తూ అనేకమైన ఇతర గ్రంథాలు వున్నాయి.

## బ్రహ్మసూత్రాలపై వ్యాఖ్యలు

బ్రహ్మ తప్ప మరిదేన్నీ సత్యంగా అంగీకరించనందువలన ఈ వేదాంత దర్శనాన్ని అద్వైతం అన్నారు. ఈ దర్శనంలో భగవంతునికి చాలా తక్కువ ప్రాముఖ్యం వుంటుంది. ఆత్మ ఒక్కటే సత్యం కాబట్టి, ఆత్మదర్శనమే పరమ ధ్యేయంగా భావించబడింది. అటువంటి ఆత్మదర్శనాన్ని పొందటమే మోక్షమన్నారు. వ్యావహారిక దృష్ట్యా మాత్రమే భగవంతుని ఉనికిని గుర్తించడం జరిగింది. ఇది ఒక విధమైన మినహాయింపు. భగవంతుని అంగీకరిస్తూ దాన్ని అధిగమించిపోవడం ఈ దర్శనంలోని విశేషం. ఐతే, దైవాన్ని గుర్తించిన మతశాఖలు అనేకం మన దేశంలో వున్నాయి. శివుని ఆధిపత్యాన్ని అంగీకరించినవారు శైవులుగను, విష్ణువును ఆరాధించేవారిని వైష్ణవులుగను సాంప్రదాయం గుర్తించింది.

బ్రహ్మ సూత్రాలపైనా, శంకర భాష్యంపైనా ప్రజల్లో గౌరవ ప్రవృత్తులు పెరుగుతున్న రోజుల్లో అద్వైతవాదాన్ని నిరాకరించి తమతమ మతాలను పటిష్ఠం చేసుకోవలసిన అవశ్యకత శైవుల్లోనూ, వైష్ణవుల్లోనూ ఏర్పడింది. అందుకే

బ్రహ్మసూత్రాలకున్న విలువను దృష్టిలో నుంచుకొని ప్రత్యామ్నాయ భాష్యాలను ఈశ్వరవాదాన్ని సమర్థిస్తూ వ్రాసినారు. ఈ భాష్యాలన్నీ జీవ-బ్రహ్మల మధ్యకల సంబంధాన్ని వివరిస్తాయి. ఇదే వీటిలోని ముఖ్యాంశం. రామానుజుడు, నింబార్కాచార్యుడు మొదలగు వైష్ణవులు విష్ణువున్ను పరమ ఆరాధ్యదైవంగా భావిస్తే శ్రీకంఠుడు మొదలగు శైవులు శివుని పరమదైవంగా ఆరాధించినారు.

ఈశ్వరవాదాన్ని సమర్థిస్తూ మొట్టమొదటగా భాస్కరాచార్యుడు బ్రహ్మసూత్రాలపై వ్యాఖ్యను వ్రాసినాడు· ఇతని సిద్ధాంతాన్ని, "భేదా భేదవాదం" అంటారు. ఇతని దర్శనంలో జీవుడు బ్రహ్మకన్నా భేదంగానూ, అభేదంగానూ వుంటాడు. సముద్రపు తరంగాలు, సముద్రం – ఈ రెండూ ఒకదానికి మరొకటి భిన్నంగానూ మరియు అభిన్నంగానూ ఎట్లా వుంటాయో, అట్లాగే జీవ–బ్రహ్మల మధ్య భేదా భేద సంబంధ మున్నదని భాస్కరమతం.

## రామానుజుని శ్రీభాష్యం

ఈ వ్యాఖ్యానాన్ని అనుసరించి, వివరాలలో తేడా వున్నప్పటికినీ, అనేక మైన భాష్యాలను వ్రాసినారు. వీటిల్లో రామానుజుని "శ్రీ భాష్యం" అత్యంతమైన ప్రాముఖ్యాన్ని కలిగి వున్నది. ఇతని సిద్ధాంతాన్ని "విశిష్టాద్వైతం" అంటారు. అద్వైత సాంప్రదాయాభిమానియైన గురువువద్ద విద్య నభ్యసించి తమిళ దేశంలోని ఆళ్వారుల వైష్ణవభక్తి వుద్యమంచేత ప్రభావితుడై, శంకర అద్వైతాన్ని ఖండిస్తూ, భగవత్ భక్తికి తన దర్శనంలో ప్రత్యేకమైన స్థానమిస్తూ, ఆళ్వారుల ప్రబంధాలను అన్వయించే శక్తిని అద్వైత సాంప్రదాయాన్నుంచి గ్రహించి, విశిష్టాద్వైతాన్ని స్థాపించిన ఖ్యాతి రామానుజునికే దక్కింది. ఈ విశిష్టాద్వైత దర్శనంలో "చిత్", "జగత్" బ్రహ్మ-అనే వాటికి సమానమైన స్థానమున్నది. "భగవంతుడు సత్యములలోకెల్ల పరమసత్యం. ఆయన కళ్యాణగుణశోభితుడు. ఆయన కేవలం జ్ఞానస్వరూపం కాదు. జ్ఞానం ఆయన విశేషగుణం. సర్వజ్ఞత్వం, సర్వాంతర్యామిత్వం, దయాళుత్వం ఆయన గుణాలు. సర్వమూ భగవంతుని మయం. అందువలన భగవంతుడు తప్ప స్వతంత్రమైనది మరొకటి ఏదీ లేదు. ఐతే, "చిత్", "అచిత్" అనేవి రెండూ ఆయనలోనే అపృథక్ సిద్ధ విశేష గుణాలుగా వున్నాయి. మానవ శరీరానికి, మానవుని ఆత్మకు ఏవిధమైన సంబంధం వుంటుందో అదే సంబంధం 'చిత్' 'అచిత్'ల మధ్య వుంటుంది ఇవన్నీ కలసి వున్న రూపమే భగవంతుడు. ఆయనను విస్మరిస్తే ఈ రెంటికీ పరమార్థం వుండదు. భగవంతుని చేరడానికి భక్తి మార్గమే శరణ్యం. మోక్షం భగవదధీనం కాబట్టి, భక్తి, ప్రపత్తి శరణాగతుల వలన భగవంతుని కృపవలన మోక్షం పొందగలమే గాని, కేవలం జ్ఞానం వలన మోక్షం సిద్ధింపదన్నాడు రామానుజుడు.

ఈ భక్తి అవిచ్ఛిన్నంగా ప్రవహించే తైలధారలాగా వుండాలన్నాడు. సంగ్రహంగా ఇదీ రామానుజుని మతం.

# వైష్ణవ సంప్రదాయంలో ప్రముఖులు

వైష్ణవ సాంప్రదాయంలో నింబార్కాచార్యుడు, మధ్వాచార్యుడు, వల్లభాచార్యుడు, చైతన్యుడు ప్రముఖులు. చైతన్యుడు తప్ప మిగతావారందరూ బ్రహ్మ సూత్రాలకు భాష్యం వ్రాశారు. నింబార్కాచార్యుని సిద్ధాంతాన్ని 'ద్వైతాద్వైత వాదం' అంటారు. జీవునికీ బ్రహ్మకూ మధ్యకల తేడా ద్వైతంగానూ, అద్వైతంగానూ వుంటుంది. గాలి ఒకే పదార్థమైనప్పటికినీ అది అనేక రూపాలుగా మారి కనిపించినట్లు, బ్రహ్మ కూడా ఒక్కడే ఐనప్పటికినీ నానారకాలుగా గోచరిస్తాడని నింబార్కాచార్యుడు చెప్పినాడు. రామానుజుని యుగంలోని వాడు కాబట్టి ఆయన దర్శనం చేత ఇతను ప్రభావితుడైనాడు. జీవునికి-జగత్తుకు ఒక విధమైన స్వతంత్రమైన ప్రతిపత్తిని ఆపాదించినాడు. జీవుడు, జగత్తు సూక్ష్మరూపంలో బ్రహ్మలో వుండి, ఆయన శక్తి వలన వ్యావహారిక జగత్తులో స్థూలరూపాన్ని దాలుస్తాయి. రామానుజ దర్శనంలోవలె నింబార్క దర్శనంలో కూడా భక్తికి తావున్నది. నింబార్కుని అనుయాయులు రాధాకృష్ణులను ఆరాధిస్తారు.

# ద్వైత వాదం

మధ్వ సిద్ధాంతాన్ని 'ద్వైతవాదం' అంటారు. ఇందులో రెండే తత్త్వాలు వుంటాయి. ఒకటి సర్వతంత్రస్వతంత్రమైన తత్త్వం. రెండోది అస్వతంత్ర తత్త్వం. ద్వైతభావం ఈ దర్శనానికి మూలం. పదార్థానికి, భావానికి గల ద్వైతం కాదు స్వతంత్రుడైన పరమాత్మకు, పరాధారుడైన జీవాత్మకు గల ద్వైతం ఇది. విష్ణువు స్వతంత్రతత్త్వం. జీవుడు అస్వతంత్రుడు. విష్ణువు అవతారమూర్తి. ఈ అవతారమూర్తికి వాయువు పుత్రుడు. మధ్వాచార్యునే వాయువుయొక్క అవతారంగా భావిస్తారు. శంకరుని బోధనలను, అతని అనుయాయుల బోధనలను రూపుమాపడానికై మధ్వాచార్యుడు అవతరించాడని భావిస్తారు. ఇదంతా కల్పితంగా భావించినా, అద్వైతమంటే వీరికి గల విరోధాన్ని ఇక్కడే చూడవచ్చు. శంకర మాయావాదాన్ని ప్రచ్ఛన్న బౌద్ధమత సిద్ధాంతమని మధ్వాచార్యు డన్నాడు. రామానుజుడు, నింబార్కుడు ఏదో ఒక విధంగా అద్వైతంతో రాజీపడినారు కాని మధ్వాచార్యుడు ఏవిధంగానూ రాజీపడటానికి అంగీకరించలేదు. మధ్వ దర్శనంలో పంచ భేదాలున్నాయి. అవి:

1. భగవంతునికి జీవికి మధ్య భేదం

2. భగవంతునికి భౌతిక పదార్థానికీ మధ్య భేదం

3. ఒక జీవికి భౌతిక పదార్థానికి మధ్య భేదం

4. ఒక జీవికి మరొక జీవికి మధ్య భేదం.

5. ఒక భౌతిక పదార్థానికి మరొక భౌతిక పదార్థానికి మధ్య భేదం

ఇతర వైష్ణవ గురువులవలె భక్తిమార్గాన్ని మధ్వాచార్యుడు కూడా ప్రశం సించినాడు. ముక్తికి భక్తిమార్గమే శరణ్యమన్నాడు. ఈ దర్శనంలో పుక్కిటిపురాణ గాథలకు తావున్నప్పటికినీ, మాయావాదాన్ని నిర్దాక్షిణ్యంగా ఖండించినందు వలన, భౌతిక పదార్థంయొక్క ఉనికిని, దాని యదార్థతను గుర్తించడం జరిగింది. అందు వలన భారతీయ దర్శనశాస్త్రంలో భావవాద నిరాకరణ ఉద్యమానికి దోహదమివ్వటం జరిగింది.

## శుద్ధాద్వైతం

వల్లభాచార్యుని సిద్ధాంతాన్ని "శుద్ధాద్వైతం" అంటారు. బంగారానికీ, బంగా రంచే తయారయిన ఆభరణానికీ ఏ విధమైన సంబంధం వుంటుందో, అటువంటి సంబంధమే భగవంతునికీ, జీవులకూ మధ్య వుంటుందన్నాడు. 'అగ్ని విస్ఫులింగ న్యాయం' ద్వారా కూడా, అంటే, కణకణ మండుచున్న నిప్పు, అందులోనుంచి వెలువడే నిప్పురవ్వలకు ఎటువంటి సంబంధం వుంటుందో, అటువంటి సంబంధమే భగవంతునికీ, జీవులకూ మధ్య వుంటుందన్నాడు. వైష్ణవ సాంప్రదాయానుసారంగా భక్తి సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాడు. ఐతే, వల్లభ మతంలో ఆసక్తికరమైన ఒక విషయమున్నది. ఉపవాస వ్రతాదులకు ఇక్కడ తావులేనందున ఇతని దర్శనాన్ని 'ఎపిక్యూరియన్స్' దర్శనంతో పోల్చినారు. ఉపవాసదీక్షతోనూ, అనశన వ్రతాల తోనూ భగవంతుని ఆరాధించరాదన్నాడు. భగవదంశమైన ఆత్మకు ఆశ్రయమైన ఈ శరీరం కూడా పరమ పవిత్రమైనదే నన్నాడు.

చైతన్యుడు ఏమీ వ్రాసినట్లుగ మనకు నిదర్శనం లేదు. ఇతని దర్శనాన్ని 'అచింత్య భేదా భేద వాదం' అంటారు. ఈ దర్శనంలో గల తాత్విక మతపర మైన సూక్ష్మ అర్థాలు సామాన్య ప్రజలను అంతగా ఆకర్షించినట్లు కనిపించవు. అయితే, చైతన్యుని బోధనల వలన మధ్య యుగంలో వున్న అతి సామాన్య ప్రజల్లో కూడా కొంత మార్పు వచ్చిందని చెప్పవచ్చు. ఆయా ప్రాంతపు ప్రజ లకు అర్థమయే భాషలో భగవంతుని దృష్టిలో మానవులందరూ సమానులనీ,

వారిలో తారతమ్యాలులేవనీ, భావయుక్తంగానూ, భక్తి పారవశ్యంతోనూ పాటలు పాడి ప్రజలను చైతన్యవంతులుగ చేసిన ఖ్యాతి చైతన్యునికే దక్కుతుంది.

వైష్ణవేతరులలో శ్రీకంఠుడు శైవమతపరంగా బ్రహ్మసూత్రాలను భాష్యం వ్రాసినాడు. శివుడే జగత్తుకు కారణం; నిమిత్త కారణం. విజ్ఞాన భిక్షువు మరొక భౌతిక వ్యాఖ్య వ్రాశాడు. దీనిని అతడు సాంఖ్య అన్నాడు; కాని కాదు.

భారతదేశంలో మధ్యయుగంలో జరిగిన సాంఘిక, మతసంబంధమైన సంస్కరణలకు వైష్ణవమతం, భక్తివాదం చాలా బాగా తోడ్పడినాయి. ఐతే మనకు దార్శనికంగా ఆసక్తిని కలిగించే విషయం ఒకటి వున్నది. భక్తివాదాన్ని భగవంతుని ఆరాధనను వీరు వ్యాపింపచేసినప్పటికీ, జగత్తు మిథ్య అని చెప్పే అద్వైతవాదాన్ని ఖండించారు. ఐనప్పటికినీ అద్వైత వేదాంతం నేటికి కూడా చాలా ప్రభావాన్ని కలిగివున్నది. అందుకే మన దృష్టిని అద్వైతంమీద కేంద్రీకరిద్దాం. ఐతే ఉపనిషత్తుల భావవాదంనుంచి అద్వైతం కొంత గ్రహించినందున అద్వైతాన్ని గురించి చర్చించే ముందు, ఉపనిషత్తుల్లోని భావవాదాన్ని గురించి కొంత తెలుసుకుందాం.

---

— శాంతియుత పోరాటంలోని మార్గాలన్నీ విఫలమైనప్పుడు, పరిమితం చేయబడినపుడు, దౌర్జన్యకాండ కొనసాగుతున్నప్పుడు మాత్రమే కమ్యూనిస్టులు ఆత్మ రక్షణకోసం దౌర్జన్య విధానాన్ని బలపరుస్తారు. —రాహుల్జీ.

---

# రాహుల్ సాంకృత్యాయన్ : సుదూర స్మృతులు

డా. సంజీవ దేవ్

కనిపించటం వేరు, వుండటం వేరు.

వస్తువులు, చెట్లు, జంతువులు మొదలైనవి కనిపించినట్లుగానే వుంటాయి. మనుషుల విషయం వేరు. వారిలో అధిక సంఖ్యాకులు కనిపించటం ఒక విధంగా వుంటే వుండటం మరో విధంగా వుంటారు.

ఒక అస్తిత్వం కనిపించటాన్ని మనం చూస్తాం, కాని అది వుండటాన్ని మనం చూడజాలం.

కనిపించటాన్ని చూస్తాం, వుండటాన్ని కొన్ని తీరుల ద్వారా తెలుసుకుంటాం.

రాహుల్ సాంకృత్యాయన్ కనిపించినట్లుగానే వుంటాడు కూడ. కనుక ఆయన్ను మనం చూడటం తెలుసుకోటం కూడ ఒకటే.

ఒక విధంగా కనిపిస్తూ మరో విధంగా వుండడు. ఒక విధంగా వుంటూ మరో విధంగా కనిపించడు.

తమ ఆలోచనల ననుసరించే తన ఆచరణ లుంటాయి.

రాహుల్‌జీ సామాన్య మానవుడు.

రాహుల్‌జీ అసామాన్య మానవుడు.

ఆయనతో నేనున్న జ్ఞాపకాలు, నాతో ఆయన వున్న జ్ఞాపకాలు ఎన్నో వున్నాయి. అవన్నీ ఆయనలో ఇప్పుడు లేవు; కారణం ఆయన ఇప్పుడు లేడు. అవి నాలో ఇప్పుడున్నాయి; కారణం నేనిప్పుడున్నాను కనుక.

వుండటానికి జ్ఞాపకాలెన్నో వుంటాయి కాని వున్న జ్ఞాపకాలన్నీ అక్షర రూపం దాల్చటం కష్టం.

ఈ జ్ఞాపకాలు ఘటనల రూపాల్లో వున్న రోజుల్లో రాహుల్‌జీ కంటె వయసులో నేను చాలా చిన్నవాణ్ణి. అయినప్పటికీ తనను నాకంటే పెద్దవాడిగా చూచేవాడు ఆ పెద్ద మనిషి. పెద్ద మనిషి కాదు పెద్ద మనీషి ఆయన.

రాహుల్‌జీకి అప్పటి బెజవాడలోని సి. వి. ఆర్ కాలేజీ ప్రిన్సిపాల్ డా. పుట్టపర్తి శ్రీనివాసాచారి మిత్రుడు. వారిద్దరు ఒకప్పుడు లండన్‌లో వుండే వారు. శ్రీనివాసాచారి గారికి నేను మిత్రుణ్ణి. కనుక రాహుల్‌జీ నాకు మిత్రుడు.

1944 వేసవి ప్రారంభంలో బెజవాడలో కమ్యూనిస్టు పార్టీ వారు అఖిల భారత కిసాన్ మహాసభలు జరిపారు. ఆ సందర్భంగా ఆహ్వానించబడి బౌద్ధ విద్వాంసుడైన కమ్యూనిస్టు రాహుల్‌జీ బెజవాడ రావటం జరిగింది. ప్రిన్సిపాల్ గారు నన్ను బెజవాడకు తీసుకపోయి తమ ఇంట రాహుల్‌జీతో నాకు మైత్రి కుదిర్చారు.

నా మొదటి చూపులో రాహుల్‌జీ నాకు మనిషిగా కాక మాట్లాడుతున్న పాలరాతి బౌద్ధ విగ్రహంగా గోచరించారు.

ఆయన్ను గురించి ఎప్పటినుంచో తెలుసు కాని ఆయన్ను తెలియదు అప్పటివరకు. ఆయన రూపం, రంగు, స్వభావం, మాటలు, భావభంగిమలు ముఖంలో వెలుగుతున్న ప్రజాదీప్తి మొదలైన వన్నీ నాలో ఒక అపరిచిత అను భూతిని రేకెత్తించటంలో సఫలమైనాయి.

డా. శ్రీనివాసాచారి గారు ఆయన్ను నాకు పరిచయం చేయకుండా నన్నే ఆయనకు పరిచయం చేశారు. కారణం రాహుల్‌జీ జగ మెరిగిన మనీషి. మరి నేనో......?

నేను ఆయనతో ఎక్కువగా హిందీలోనే మాట్లాడాను. అవసరమైతే తప్ప ఆయన ఇంగ్లీషులో మాట్లాడడు. ఎక్కువగా హిందీలోనే జరిగేది మా సంభాష ణంతా. విచిత్రం ఏమిటంటే హిందీ మాతృభాష కాని నేను హిందీలో త్వర త్వరగా మాట్లాడుతుంటే రాహుల్‌జీ చాలా నిదానంగా మాట్లాడేవారు.

అందువల్ల నాకనిపించింది నాకు సరీగా హిందీ రాదేమో అని; బాగా వచ్చి వుంటే ఆయన మాట్లాడినట్లు నేను కూడ నెమ్మదిగా నిదానంగా మాట్లాడే వాడినే గదా అని. భాష బాగా రానివాళ్ళు ఆ భాషను వేగంగా మాట్లాడతారని నమ్మేను.

మా యిద్దరికీ త్వరలో మైత్రి కుదరటం గమనించిన ప్రిన్సిపాల్ శ్రీనివాసా చారిగారు లోలోపల సంతసించటమే కాక పైపైన సంతసించటం మాకు కనిపించింది.

బెజవాడనుంచి రాహుల్‌జీ నేను ఒక మధ్యాహ్నానంతరం రైల్లో తుమ్మపూడి మా ఇంటికి చేరుకున్నాం. ఆంధ్రదేశపు గ్రామాలను, గ్రామీణులను, గ్రామాల్లో జీవన రీతులను, వ్యవసాయంలో చేసే విధానాలను చూచి ఆయన ఎంతో ఆనందించారు.

ఆయన భోజనాన్ని గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకునే అవసరం వుండేది కాదు. మన ఇళ్ళలో దొరికే కాయగూరలను, ఆకు కూరలను, ఆవకాయ, వూరగాయలను అన్నీ సంతృప్తిగా తినేవారు. ఆయనకు ఏ దేశమూ పర దేశం కానట్లే, ఏ దేశ వాసీ పరదేశి కానట్లే, ఏ భాషా పరాయి భాష కానట్లే ఏ భోజనం కూడ పర భోజనం కాదు.

ఆ రాత్రి ఇంటివద్ద వసంతాకాశం క్రింద నక్షత్ర కాంతిలో ప్రొద్దుపోయే దాకా ఆకాశంలోని విషయాలు, భూమి మీది విషయాలు, ప్రాచీన, అర్వాచీన విషయాలు-ఎన్నో మాట్లాడుకుంటూ పడుకున్నాం.

ఇంటిలోని మా పెదతల్లి అపుడపుడు మా వద్దకు వచ్చి కొన్ని నిమిషాలు నిలబడి మా మాటలు ఆమె తెలుసుకోలేక వెళ్ళిపోయేది.

రష్యాలోని తన రష్యన్ భార్యను గురించీ, తమ పసి అబ్బాయిని గురించీ చెప్పటంలో ఆయన కెంతో సంతోషం కలిగేది. వాళ్ళను గురించి చెబుతుంటే వాళ్ళు తన సమక్షంలో వున్నంత సంతృప్తిని పొందేవారు ఆయన.

తుమ్మపూడిలో వున్న కొన్నాళ్ళలో ఆయన కొన్ని ప్రక్క వూళ్ళలో రష్యాలో వ్యవసాయాలను గురించీ, సామాజికాలను గురించీ హిందీలో ప్రసంగాలు చేస్తుంటే నేను తెలుగులోకి అనువదించి చెపుతుండేవాణ్ణి.

ఈ విధంగా మా తుమ్మపూడి నివాసం పూర్తి అయి ఇక అమరావతి, నాగార్జున కొండ మొదలైన బౌద్ధ కేంద్రాలను, వాటిలోని శాతవాహనుల, ఇక్ష్వాకుల శిల్ప సంపదను ఆయనకు చూపటానికి ఆయనను వెంట పెట్టుక వెళ్ళాను.

ఆయనతో కలిసి ప్రయాణం చేయటం అంటే ఒక లైబ్రరీలోని పుస్తకాలను తిరగవేస్తున్నట్టుంది. ఒక విశ్వవిద్యాలయంలోని ప్రొఫెసర్ల ఉపస్థితిలో కూర్చొని వారి జ్యోతిర్మయ భాషణలను ఆలకిస్తున్నట్లుంటుంది, ప్రాజ్ఞులతో సంభాషణలను జరుపుతున్నట్లుంటుంది.

మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్ త్రిపిటకాచార్యలోని విశిష్టతలను తెలియని వారుంటారేమో తెలియదు. ఒకవేళ వుండి వుంటే అటువంటి వ్యక్తుల లోని విశిష్టత ఏమిటని ఎవరైనా ప్రశ్నిస్తే వచ్చే జవాబు ఏమంటే "రాహుల్‌జీని గురించి తెలియకపోవటమే ఆ విశిష్టత" అని.

రాహుల్‌జీ విశిష్టతను గురించి ఒక్క మాటలో చెప్పాలంటే "మనలో వున్నవన్నీ రాహుల్‌జీలో వున్నాయి కాని రాహుల్‌జీలో వున్నవన్నీ మనలో లేవు" అని.

మొదటి నుంచీ ఆయన స్వేచ్ఛావాది, సంప్రదాయ విరోధి. మొదటగా వేదాధ్యయనంతో ప్రారంభమైన ఆయన జీవితం ఆర్య సమాజంలోకి, తరువాత విశిష్టాద్వైతంలోకి మారుతూ వచ్చి తరువాత బౌద్ధంలో ప్రవేశించి అందులో వుంటూనే కమ్యూనిస్టు పార్టీలో ప్రవేశించింది. కమ్యూనిస్టు పార్టీలో వుంటూనే ఆయన గొప్ప బౌద్ధ పండితుడుగా రూపొంది పాళీ భాషలోని బౌద్ధ "త్రిపిటకాలు"ను హిందీలోకి అనువదించి ఆ రంగంలో విఖ్యాతుడైనారు. ఆయనకెన్నో ఎన్నో భాషలు తెలుసు. ఆయన భాషాభిజ్ఞుడు (Linguist) మాత్రమే కాదు, భాషాశాస్త్రజ్ఞుడు (Philologist) కూడా. ఎన్నో భాషలు తెలిసినట్లుగానే ఎన్నో భాషల మూలాలు, వాటి వికాసాలు, వాటి వాటి వ్యాకరణ మర్మాలు, భాషలలోని పారిభాషిక పదాలు, లిపి వున్న భాషల వచనా పటుత్వం, లిపి లేని భాషల వాగ్ధోరణి మొదలైన విశిష్ట విషయాల కదిలే విజ్ఞాన సర్వస్వం ఆయన.

నాగార్జున కొండ ప్రాంతంలోని పుల్లారెడ్డి గూడెం అనే ఒక చిన్న గ్రామంలో మేము బస చేశాం అక్కడ ఒక కొద్దిపాటి లంబాడీ తండా నివసిస్తుంది రాహుల్‌జీ గౌరవార్థం ఆ లంబాడీ వనితలు ఆ రాత్రి తమ నృత్యాన్ని ప్రదర్శించారు. తప్పెట్ల వాద్యాల మధ్య, లంబాడీ వనితలు లయ మయ నర్తన రీతుల వలెనే లంబాడీ పురుషుల శ్రావ్యమైన వివిధ తాళ వరసల తప్పెట దరువులు కూడ ఎంతో ఆనందం ఇచ్చాయి.

ఆ నృత్య ప్రదర్శనానికి రాహుల్‌జీ బాగా స్పందించారు. వాళ్ళ భాష ఏమై వుంటుందని ప్రశ్నించగా అపభ్రంశ మరాఠీ అయి వుంటుందేమో అని అన్నాను నేను. వాళ్ళను సంభాషించి వాళ్ళ సంభాషణలు శ్రద్ధగా విని వాళ్ళతో సంభాషణ సాగించారు వాళ్ళ భాషలో. వినేవాళ్ళు ఆశ్చర్యపోయారు. లంబాడీ భాష ఆయన కెట్లా తెలుసునా అని అందరి ఆశ్చర్యం. అది గ్రహించి ఆయన చెప్పసాగేరు "వీళ్ళ భాష అపభ్రంశ మరాఠీ కానీ మరొకటి కానీ కాదు, అది గుజరాత్ రాజస్తాన్‌ల సరిహద్దు ప్రాంతపు భాష, కొంత మార్పుతో. ఆ భాషలు వాళ్ళు ఎక్కడెక్కడ పగులగొట్టి మాట్లాడుతున్నారో గ్రహించిన నేను కూడా దాన్ని అదే మాదిరి పగులగొట్టి మాట్లాడితే అది వాళ్ళకు అర్థం అయింది, వాళ్ళ మాటలు నాకూ అర్థమయ్యాయి" అని.

ఆయన భాషా ప్రతిభ అత్యద్భుతం అని మేము ఆశ్చర్యపడకుండా వుండలేకపోయాం। అటువంటి ప్రజ్ఞాజ్వాల ఆయనలో వెలుగుతుండేది ।।

తుమ్మపూడి నుంచి మేం ముందుగా పోయింది అమరావతి. అమరావతిలోని

శాతవాహనుల శిల్ప విశేషాలను, బౌద్ధ శిథిల స్తూప సంపదను మేము అనుశీలించటం వీలైనంత తొందరగా పూర్తి చేసుకున్నాం.

బౌద్ధ కేంద్రాల్లో అమరావతి స్తూప ప్రాధాన్యం కలది. బౌద్ధ వాస్తు నిర్మాణాల్లో చైత్యం, విహారం, స్తూపం అనే మూడు ప్రముఖమైనవి. చైత్యం అనేది బౌద్ధ భిక్షుల ధ్యానమందిరం; ఇందులో వీరంతా తమ సాధనకు సంబంధించిన ధ్యానాన్ని చేస్తారు. చైత్యం అంటే వీరి అంతర్ జీవితాన్ని గడిపే కట్టడం. విహారం అంటే బౌద్ధ భిక్షులు సామాన్యమైన దైనందిన జీవితాన్ని గడిపే ఆవాసం. ఇక స్తూపం అంటే వీరి మరణానంతరం నిర్మించే సమాధి.

స్తూప ప్రశస్తిని పొందింది అమరావతి.

రాహుల్‌జీలో కళాసక్తి కంటే శాస్త్రశక్తి ఎక్కువ పదును కలిగి వుంటుంది. శిల్పాన్ని చూచి దాని రూప సౌందర్యాన్ని ఆనందించటం అంటే, దాని కొలతలు, దాని కాలం, అది నిర్మితమైన మాధ్యమం, అది ఎందుకు రూపొందింది మొదలైన వివరాలు ఆయనకు ముఖ్యం. అంటే ఆయనలో ప్రధానంగా నివసించేది కళాకారుడు కాక శాస్త్రజ్ఞుడే. ఆయన దృష్టి ప్రధానంగా విశ్లేషణాత్మకం కంటే, సంశ్లేషణాత్మకం.

ఆయనలో ప్రధానంగా వెలిగేది రస దీపం కాదు, విజ్ఞాన జ్వాల, జిజ్ఞాస తృష్ణ. అలికించి చూడటం ఆయన రంగం కాదు, పగుల గొట్టి చూగటం ఆయన పని. ఎట్లా వున్నది అనే దానికంటే ఏమి వున్నది అనేది ఆయన్ను నడుపుతుంది. సౌందర్యం కంటే ఉపయోగం ఆయనకు ఎక్కువ ఉపయోగమైంది.

పర్యవసానం ఏమంటే ఆయన జీవించటానికి తింటాడు కాని తినటానికి జీవించడు. అందుకని ఆయన ఆనంద జీవి కాడా అంటే ఆనంద జీవే అనాలి. ఆయన ఆనందం స్పందిస్తుంది. సత్య సాధనలో, సత్య శోధనలో.

పలనాడులోని పుల్లారెడ్డి గూడెంలో మేము ఇద్దరం ఒక మట్టి మిద్దె మీద నిద్రించాం. వేసవి ప్రారంభ దశలో అంతగా వేడిగా కాని, చలిగా కాని లేక సమ శీతోష్ణంగా ఉన్నందున మాకు హాయిగా నిద్రపట్టింది. ఆ రాత్రి లంబాడీలు చేసి ఇచ్చిన వేడి వేడి జొన్న రొట్టెలు ఆకుకూరతో కలిపి, మధ్య మధ్య కాల్చిన మిరప కాయలు కొరుకుతూ సంతృప్తిగా తిని చిక్కని మజ్జిగ త్రాగి పడుకున్నాం.

రాహుల్‌జీ చాలా రాత్రి వరకూ తన జీవితగాథ, ఒంటరిగా కాలినడకతో టిబెట్ ప్రయాణాలు, హిమాలయ సాంద్రారణ్యాల మధ్య గుండా రావటాలు పోవటాలు, కొండ నెక్కటాలు, లోయలోకి దిగటాలు, ఆ సమయాల్లో కలిగే ఖేదాలు మోదాలు మొదలైనవన్నీ ఒకోసారి పెద్దగా నవ్వుతూ, మరోసారి తనలో తాను నవ్వుకుంటూ, ఇంకోసారి గంభీర రూపంలో చెప్పి ముగించారు.

తన జీవితాన్ని గురించి తనకే ఆశ్చర్యంవేస్తుందట అపుడపుడు. భారతీయుల జీవితాలు ప్రథమంలో బ్రహ్మచర్యంతో ప్రారంభించి గృహస్తంలోకిమారి,అందులో

నుంచి వానప్రస్థంలో ప్రవేశించి అంతంలో సన్యాసంలోకి అడుగుపెట్టి ఆగి పోతాయి.

అయితే తన జీవితం అందుకు తలక్రిందులుగా పరిణతి చెందిందట. తాను మొదటిలో సన్యాసి అట. తరువాత కొండలు కోనలు అరణ్యాలు తిరుగుతూ వాన ప్రస్థ జీవితాన్నీ అటు తరువాత గృహస్థ జీవితాన్నీ గడుపుతున్నాడు. "ఇక ఖదప బోయేది బ్రహ్మచర్యం" అంటూ పెద్దగా నవ్వి "బాగుంది కదూ" అంటూ నా వీపు చరిచాడు.

అందుకు నేను అన్నాను "అసలు జీవన క్రమం అదేనేమో! మీరు గడుపు తున్న క్రమ పద్ధతే సక్రమ పద్ధతేమో. దాన్నే అందరూ అనుసరించాలని నేనననుకాని ఆ విధంగా మీరు అనుసరించటాన్ని నేను హార్దికంగా ఆమోదిస్తాను, అందుకు మిమ్ములను అభినందిస్తాను. జీవితంలో మీరు పెంచుకున్న మీ మన్ను మీది ఆశలను, మిన్ను మీది ఆశయాలను ఆరాధిస్తాను.

మరుసటి పగలంతా కాళ్ళు నొప్పులుగా అనిపించేంత వరకు ఆ సమతలం కాని ప్రదేశాన్నంతా కలియ తిరిగాం, కంటికి కనిపించిన దాన్నంతా కలియ చూచాం, ఆస్వాదించాం, కనిపించని దాన్ని గురించి ఆలోచించాం, సమాలోచించాం.

మావి కొన్ని అన్వేషణలు, గవేషణలు, తార్కిక చర్చలు మొదలైనవి చరిత్రను అనుమానించాయి. చరిత్రకు పూర్వ యుగంలోని వాస్తవాలను చరిత్ర తెలుసుకోజాలదు; వాటిని తెలుసుకోవలసింది పురాతత్వ శాస్త్రం. ప్రథమ చరిత్ర యుగం (Proto-history) లోని విషయాలను గురించిన వాస్తవాలు కూడా చరిత్ర కందవు, అప్పటికి చారిత్రక పరిశోధన వికసించ లేదు కనుక. ఇక చరిత్ర యుగం లోనివి కూడా అంతగా నమ్మటానికి వీలుండవు. కారణం అప్పటి చరిత్రకారుల పరిశోధనల మీద కూడ వస్తుగత హేతువాదానికంటే వ్యక్తిగత విశ్వాసాలు ప్రాబల్యాన్ని కలిగి వున్నాయి కనుక.

ఈపై అనుమానాలను బట్టి చూస్తే, భూతకాలపు వాస్తవాలను తెలుసుకోటానికి ఎక్కువ వాస్తవమైన ఆధారం పురాతత్వ శాస్త్రమే అని రాహుల్‌జీ తన అభిప్రాయాన్ని వ్యక్తపరచారు. పురాతత్వ శాస్త్ర పరిశోధనకు బలమైన ఆధారాలు శిల్ప కళ అని కూడ ఆయన అభిప్రాయం. అమరావతిలోని శాతవాహన బౌద్ధ శిల్పాలు ఎంతో ప్రముఖమైనవని కూడ ఆయన అభిప్రాయపడ్డారు. ఈ విషయంలో ఇంతవరకు జరిగిన పరిశోధనలు ఆంశికాలేకాని సమగ్రాలు కావని ఆయన అభిప్రాయం. జరిగింది కొద్ది, జరగాల్సింది చాలా ఎక్కువ వున్నదని ఆయన అన్నారు.

ఆంధ్ర బౌద్ధ కళలో చాలా లలితమైనవనీ, అభివ్యక్తి మూలకనమైవనీ, నిర్మాణాత్మకంగాను (Structurally), ఉపయోగాత్మకంగాను (Functionally)

కూడా అవి ఎంతో ఔన్నత్యాన్ని అందుకొన్నవని కూడ ఆయన అభిప్రాయ పడ్డారు. ఆయన ఒక్కరి అభిప్రాయం మాత్రమే కాదది.

రాహుల్‌జీని గురించి వ్రాయటం అంటే విశ్వవ్యాప్త దీప్తిని గురించి వ్రాయటమే అవుతుంది. నేనొక చోట ఆయన్ను గురించి వ్రాశాను :

"రాహుల్‌ది విచిత్ర స్వభావం. వ్యతిరేకతకు, భయాందోళనలకు చలించడు. భయాన్ని జయించిన వాళ్ళలో ఆయనొకడు. జీవన అమరత్వం మీద, శాశ్వతత్వం పైన ఆయనకు అభిలాష వుండేది కాదు. క్షణ భంగురత్వం గురించి భయం ఎందుకనేవాడు. అమరత్వం, శాశ్వతత్వం అనేవి కూడా జీవికి ఒక విధమైన బంధనకే అని చెప్పేవాడు.

"సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, మీమాంస, వేదాంత అనబడే షడ్దర్శనాలను గురించి ఎంతగా అధ్యయనం చేశాడో అంతగానే పాశ్చాత్య దర్శనాలను కూడా చేశాడు. థేల్సు, సోక్రటిస్, ప్లేటో, అరిస్టాటిల్ మొదలు మార్క్సు, ఎంగెల్సు, జీన్‌సాల్ సార్త్రే వరకూ ఆయన ఎవరినీ వదలలేదు."

ఆయనకు వివాహం కాక ముందు ఆయన కొంత కాలం రష్యాలోని లెనిన్‌గ్రాడ్ యూనివర్శిటీలో ప్రాచ్య భాషలకు ఆచార్యుడుగా వుండేవాడు. తన విభాగంలో ఒక రష్యన్ యువతి తనకు తోడుగా పని చేస్తుండేది. వారిద్దరికీ స్నేహం ఏర్పడి చివరకు ఆ స్నేహం వారి వివాహంలోకి రూపొందింది. తరువాత వారికి ఒక అబ్బాయి కూడ కలిగేడు.

ఆయనది ఎవరితోను కలిసి వుండే స్వభావం కాకపోవడంతో భార్యతోకూడ కలసి వుండలేకపోయాడు. రష్యన్ కుటుంబాన్ని అక్కడే వదలి తాను ఒకడే భారతదేశానికి తిరిగి వచ్చాడు. తరువాత భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీలో బాగా పని చేశాడు.

తన మొదటి వివాహం*నాటికి ఆయన వయస్సునలభై నాల్గువుంటాయి. రాహుల్జీ లాంటి వారు పెళ్ళి కాకుండానూ వుండలేరు, పెళ్ళి అయీ వుండలేరు. రష్యా నుంచి తిరిగి వచ్చిన కొంత కాలానికి యు.పి.లోని కమల అనే ఒక యువతిని వివాహం చేసుకొన్నాడు. ఆ దంపతులకు జేతా, విజయ్ అని ఒక అమ్మాయీ, అబ్బాయీ జనించారు.

ఆయన హిందీలో రచించిన గ్రంథాలు సారంలోను సంఖ్యలోను కూడ చెప్పుకోదగినవి. వాటిలో "ఓల్గాసే గంగా" అనే గ్రంథం విఖ్యాతమైంది. దాన్ని

---

* రష్యన్ యువతి లోలాతో వివాహం రెండోది. మొదటిది చాలా చిన్న వయసులో తలిదండ్రులు చేయించింది. ఆ వివాహాన్ని రాహుల్‌జీ ఎన్నడూ పట్టించుకోలేదు.

నాకిచ్చిన మరుసటి సంవత్సరంలో నేను పశ్చిమ హిమాలయాల్లోని రష్యన్ మహోదయుడు నికొలాయ్ రోరిక్ దగ్గరకు పోయి వారి కుటుంబంలో కొన్నాళ్ళుండటం జరిగింది ఆయన పెద్ద కొడుకు జార్జ్ రోరిక్ ప్రాచ్య భాషల పండితుడు. ఆయనకు నా దగ్గరున్న "ఓల్గా సే గంగా" ఎంతో నచ్చింది. దాన్ని ఆయనకు బహూకరించాను.

మస్సోర్సీలో సకుటుంబంగా జీవిస్తున్న రోజుల్లో రాహుల్జీకి మతిమరపు (అమ్నేషియా) సంక్రమించింది. దానితో ఆయనలోని జ్ఞాపకశక్తి పూర్తిగా నశించి భార్యనూ బిడ్డలను, తన గ్రంథాలను కూడ గుర్తించలేని దురవస్థ ఏర్పడింది. ఆయనలో ఏది ప్రధానమో అదే నశించిపోయింది. ఆయన మానసిక శక్తుల్లో జ్ఞాపకశక్తి ప్రధానమైంది. ఆ జ్ఞాపకశక్తియే లేకుండా పోయింది. మొదటి భార్యను చూస్తే స్మృతి మేల్కొంటుందేమో అని ఆయన్ను లెనిన్ గ్రాడ్ కూడ తీసుకపోవటం జరిగింది. కాని ఫలితం శూన్యమైంది.

ఆ వ్యాధి క్రమేణ తీవ్రరూపం దాల్చి 1963లో ఆయన ఆ వ్యాధి నుంచేకాక అన్ని వ్యాధుల నుంచి కూడ విముక్తుడైనాడు శాశ్వతంగా.

అటువంటి వ్యక్తులు ఈ భూమి మీద కొద్దిమంది మాత్రమే వుంటారు.

నాగార్జున కొండ దగ్గర ఏదో ప్రసంగ సందర్భంలో ప్రశ్నించారు ఆయన. నా జీవితంలోని చరమ ఆశయం ఏమిటని, నేను తక్షణం తడుముకోకుండా సమాధానం ఇచ్చాను "మరణించే క్షణం వరకూ జీవించి వుండటం" అని

(ప్రజాసాహితి సౌజన్యంతో)

---

"ఆర్యులు భారతదేశానికి బయట నుండి వచ్చారు" అని అంగీకరించక పోయిన యెడల ఆర్య భాషా పరివారానికి చెందిన భాషలు వారు యిక్కడి నుండి బయటకు వెళ్ళారని ఒప్పుకొనక తప్పదు. దీనివలన యింకా అనేక చిక్కులు వస్తాయి. వాటికి సమాధానం చెప్పటం కష్టమవుతుంది. ఆర్య భాష, భారత ఐరోపా భాషలు, వానికి సంబంధించిన యితర సామగ్రి యందు శ్రద్ధ లేకుండుటయే పై వాదనకు ముఖ్యమైన కారణంగా తోస్తుంది. అందుచేత మన శాస్త్రవేత్తలు కలియుగాన్ని మహాభారత కాలాన్ని నమ్మిన మన చరిత్రను వేల సంవత్సరాలు వెనుకకు తీసుకొని పోవుటకు ప్రయత్నిస్తున్నారు. ఆసియా మైనరులో హిట్టైయిటులు, గ్రీసులో యవనులు, ఇరానులో ఇరానీయులు ప్రవేశించిన కాలాన్ని పరిశీలిస్తే ఆర్యులు భారతదేశంలో ప్రవేశించింది క్రీ.పూ. 1500 కంటే పూర్వం కాదనేది వాస్తవమనిపిస్తుంది. భరద్వాజ, వశిష్ట, విశ్వామిత్రులను ప్రాచీన ఋగ్వేద ఋషులనుకుంటే వారి కాలం పైన చెప్పిన కాలానికి 300 ఏండ్ల తర్వాత అవుతుంది. —రాహుల్జీ

"ఋగ్వేద ఆర్యులు" నుండి

# మార్క్సిజం సమకాలీనత

## కలకత్తా గోష్టిలో వియత్నాం కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధి సమర్పించిన పత్రం

సోవియట్ యూనియన్, ఇతర తూర్పు యూరప్ సోషలిస్టు దేశాలు కూలిపోయిన అనంతరం మార్క్స్ ఆలోచనా వారసత్వాన్ని పునరంచనా వేసుకోవలసిన అవసరం కల్గింది.

మార్క్స్ విప్లవకర శాస్త్రీయ సిద్ధాంతం విశ్లేషణతోపాటు ప్రస్తుత పరిస్థితి గురించిన పరిశీలన కూడ అవసరం. వివిధ దేశాల విప్లవోద్యమాలు దానినుండి తగిన గుణపాఠాలు తీసుకోవాలి. ఇది నేటి అత్యంత ప్రధాన కర్తవ్యం.

అంత శరవేగంతో, అంతటి విస్తృత స్థాయిలో రాజకీయ వ్యవస్థ ఎన్నడూ కూలిపోలేదు. దీని అర్థం సోషలిజం, మార్క్సిజంలు అంతరించిపోయినవా? సోషలిజం, కాపిటలిజం మధ్య సాగుతున్న చారిత్రక పోరాటం సమసిపోయిందా?

ప్రజల చరిత్ర అవగాహన మసగబారకపోతే, మానసిక, రాజకీయ, "దిగ్భ్రమ" కు వారు లోనుకాకపోతే మార్క్సిజం ప్రాధాన్యతను నిరాకరించటం అంత సులభం కాదు. కారల్ మార్క్స్ సృజించిన శాస్త్రీయ సోషలిజం సిద్ధాంతం మానవజాతి విముక్తికి అంకితమైనది. అన్నిరకాల బానిసత్వాలనుండి, భ్రష్టత్వాల నుండి మానవజాతిని విముక్తి చేయటం దాని ధ్యేయం. అదినేటికి సరియైన ఆలోచనే.

మార్క్స్ సిద్ధాంతం లేదా ఇతర శాస్త్రీయ సిద్ధాంతాలకు, నిర్దిష్టమైన పరిమితులున్న వాస్తవాన్ని నిరాకరించలేము. కారణం దాని చారిత్రక అనుభవం పరిమితమయినది. భవిష్యత్తును గురించిన ఖచ్చితమైన నిర్ధారణలు ఉండవు. అయితే మార్క్స్ సిద్ధాంత పునాదులు — భౌతికవాద గతితర్కం, ప్రకృతి, సమాజం, ఆలోచనయొక్క పరిణామ సూత్రాలు, ఉత్పత్తి విధానం, సామాజిక జీవిత మార్పుల ఎడ చారిత్రక దృక్పథం, అదనపు విలువ సిద్ధాంతం — వాస్తవమైనవి, సజీవమైనవని జీవితం రుజువుచేసింది.

వివిధ దేశాలలో ఆచరించిన సోషలిజం ఒప్పులు, తప్పులతో సహా మార్క్సు సిద్ధాంతంతో ముఖ్యంగా లెనిన్ కాలంతో ముడిపడి ఉంది. మార్క్సు సిద్ధాంతం నుండి వాటి ఆచరణ పక్కమార్గం పట్టినప్పటికీ, నేటి యుగంలో మానవజాతి అభివృద్ధికి అది గొప్ప సేవ చేసింది. 19 వ శతాబ్దంతో పోల్చి చూసుకుంటే 20 వ శతాబ్దంలో మానవజాతి చాల మార్పు చెందింది. మార్క్సిజం సిద్ధాంత మార్గదర్శకత్వాన, అక్టోబరు విప్లవం ఉత్తేజంతో, సోషలిస్టుదేశాల సహాయంతో వందల దేశాలు, లక్షలాది ప్రజలు జాతీయ స్వాతంత్ర్యం పొందారు. ప్రజాస్వామ్య హక్కులను సాధించుకున్నారు.

రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిజం ఓటమి పొందింది. ఆ తరువాత అణ్వాస్త్రయుద్ధం నివారించబడింది. ప్రపంచ శాంతి నెలకొంది. వాటితోపాటుగా ఆధునిక కాపిటలిస్టు దేశాలలో పెట్టుబడి-శ్రమ సంబంధంలో వచ్చిన కొన్ని మార్పులకు, ప్రభుత్వరంగ పాత్రకు, సోషలిస్టు దేశాల అస్తిత్వమే ప్రధాన కారణం.

సోషలిజం, శ్రామికవర్గ విప్లవం నేటికి గొప్ప భౌతికశక్తిగా, ఆత్మికశక్తిగా అలరారుతున్నాయి. కొన్ని దేశాలు కూలిపోయిన మాట వాస్తవమే. కాని లక్షలాది ప్రజలు సోషలిస్టు లక్ష్యాలతో జీవిస్తున్నారు. మాజీ సోషలిస్టు దేశాలలో సైతం అక్కడ ఏర్పడిన ఆర్థిక, రాజకీయ సంక్షోభం కారణంగా ప్రజలు తిరిగి సోషలిస్టు పంథాను అభిమానించే దిశగా పయనిస్తున్నారు. ఆ విధంగా, కమ్యూనిస్టు ఆదర్శాల కొరకు నూతన పోరాటం ప్రారంభమయింది.

సోవియట్ యూనియన్, ఇతర తూర్పు యూరప్ సోషలిస్టు దేశాలు కూలి పోవటానికి ప్రధాన కారణం ఏమిటి? వారి సిద్ధాంత అవగాహన లోపభూయిష్ట మయినది. రాజకీయ నిర్ణయాలలో, సోషలిజం నిర్మాణ క్రమంలో అతివాద పిడివాదం పెత్తనం చేసింది. తక్షణ కారణం పెరిస్త్రోయికా వ్యూహం. మితవాద అవకాశవాదం పైచేయి సాధించటంతో సిద్ధాంతపరంగా, రాజకీయపరంగా సోషలిజానికి ద్రోహం జరిగింది. శత్రువర్గాలయొక్క వ్యతిరేక చర్యలు ఆ క్రమాన్ని వేగిరపరచాయి.

సోషలిజం వికృతరూపం పొందటానికి, పెడమార్గం పట్టటానికి, బ్యూరాక్రసీ పెత్తనానికి, కమ్యూనిస్టు లక్ష్యాలనుండి క్రమంగా దూరం కావటానికి మొదటి కారణం పిడివాదం. నూతన పరిస్థితిలో, కమ్యూనిస్టు వ్యతిరేక శక్తులు ప్రారంభించిన ఎదురుదాడిలో, అధికారంలో ఉన్న ఒక చిన్న ముఠా ఒత్తిడితో బ్యూరాక్రసీ శీఘ్రంగానే అవకాశవాదంగా మారిపోయి సోషలిజం కూలిపోవటానికి కారణభూత మయింది.

కారల్ మార్క్సు, ఎంగెల్సులు ప్రారంభంనుండి పదే పదే స్పష్టం చేసిన

విషయం తమ సిద్ధాంతం పిడివాదం కాదు; భవిష్యత్ సమాజం యొక్క రూపురేఖలు నిర్ణయించటంకాదు; తమ సిద్ధాంతం కేవలం మార్గదర్శక సూత్రాలను మాత్రమే వివరించిందని చెప్పారు. అట్టి పరిశీలనా పద్ధతి ననుసరించి తమ అనుచరులు ఆ సిద్ధాంతాన్ని చారిత్రిక పరిస్థితుల కనుగుణంగా అధ్యయనం చేయాలని, అభివృద్ధి పరచాలని వాంఛించారు.

దురదృష్టవశాత్తు, ఇట్టి ముఖ్యమైన బోధనలను పక్కకు నెట్టేసారు; పెడచెవిన పెట్టారు. కొన్ని సిద్ధాంత భావాలను, మార్క్స్ ఇంకా నిర్ధారణకు రాని ఊహలను, ప్రచురణకు ఉద్దేశించని నోట్స్‌ను సైతం సిద్ధాంత సూత్రీకరణలుగా. అఖండ సత్యాలుగా మార్చి అపచారం చేశారు. ఈ కారణంగా ఒక సజీవ సిద్ధాంతం జడ పదార్థంగా మారింది; ఒక మార్గదర్శిక సిద్ధాంతం సృజనశీల అన్వేషణకు అవరోధంగా మారింది.

మార్క్స్ ఆలోచన ప్రకారం, సోషలిజం పుట్టుక మానవజాతి సాధారణ నియమానికి అతీతంగా జరగదు. కాపిటలిజంను గతితార్కికంగా పరిశీలించాలి. యాంత్రికంగా, అధి భౌతికంగా కాదు.

కాగా ఈ సూత్రాన్ని లోతుగా అర్థం చేసుకోని కారణంగా, సోషలిస్టు నమూనా అనే భావం ఒకటి ఏర్పడ్డది. సిద్ధాంతరీత్యా అనేక పెడ మార్గాలకు, వాస్తవాచరణలో అనేక దోషాలకు ఇది తోవ తీసింది. అక్టోబరు విప్లవం విజయ వంతమైన తర్వాత ఇది జరిగింది లెనిన్ ఈ పెడమార్గాలను గురించి, పొరపాటు ఆలోచనలను గురించి ముందుగానే హెచ్చరించి ఉన్నాడు. దానికి పరిష్కారంగా నూతన ఆర్థిక విధానాన్ని ప్రతిపాదించాడు. దురదృష్టవశాత్తు లెనిన్ వారసులు ఈ భావాలను ఎలా ముందుకు తీసుకుపోవాలో గ్రహించలేదు. పైపెచ్చు సోషలిజం నిర్మాణమంటే, సోషలిస్టు ప్రభుత్వ స్థాపన అనుకున్నారు. ఒకే సమయంలో రెండు ఆర్థిక వ్యవస్థలు పక్క పక్కనే జీవించగలవనే భావాన్ని వారు గ్రహించ లేదు. కమ్యూనిజానికి జరిగే పరివర్తనలో బూర్జువా న్యాయ చట్టాలకుగల ప్రాధాన్యతను విస్మరించారు. ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం, సరుకుల ఉత్పత్తిని, నూతన ఆర్థిక విధానాన్ని అమలుచేయటంలో సహాయపడగలవనే అంశాన్ని విస్మరించారు. సోషలిస్టు నమూనా అనే భావన ఫలితంగా స్వీయాత్మక, యాదృచ్ఛిక నిర్ణయాలు చేయసాగారు. సరుకుల ఉత్పత్తి విధానాన్ని, మార్కెట్ ఆర్థిక వ్యవస్థను ఒక్క దెబ్బతో రద్దుచేయగలమనుకున్నారు. ప్రభుత్వ రంగం, సమిష్టి రంగం, అనే రెండు ఉత్పత్తి రూపాలనే యావత్తు సమాజానికి పరిమితం చేశారు. వీటన్నిటి ఫలితంగా, సోషలిజం ఒక్కొక్క మెట్టే దిగజారి తీవ్ర సంక్షోభంలో పడ్డది. ఉత్పత్తి స్తంభించిపోయింది.

పూర్వకాలపు ఆర్థికవేత్తలు తమ సిద్ధాంతాలను రూపొందించిన కాలం వేరు నేటి పరిస్థితులు వేరు. మానవాళి ఎదుర్కొనే సమస్యల రూపంలోను, స్వభావంలోనూ ఎంతో మార్పు వచ్చింది. కార్మికవర్గాన్ని, శ్రమజీవులను, పీడిత జాతులను, విముక్తిచేసే పోరాటాలు నూతన రూపాలలో జరగవలసి ఉంది. మార్క్స్, లెనిన్‌లు విప్లవపోరాటం బహు రూపాలలో సాగుతుందని ఏనాడో తెలియజేశారు. కమ్యూనిస్టు లక్ష్యసాధనకై పెక్కు మార్గాలు ఉండగలవన్నారు. ఇవి ఎంతో విలువైన అంశాలు. తన జీవిత కాలంలోనే మార్క్స్ 'ఆసియా తరహా ఉత్పత్తి విధానం' అంటూ ప్రస్తావించారు. అక్టోబరు విప్లవంకంటె, భవిష్యత్‌లో జరిగే విప్లవరూపాలు భిన్నంగా ఉండవచ్చునని లెనిన్ సైతం ప్రస్తావించాడు. వాటిని మనం క్షుణ్ణంగా అధ్యయనం చేయవలసి ఉంది.

ఆధునిక శాస్త్ర సాంకేతిక విప్లవం, మన భూగోళ పటాన్నే పూర్తిగా మార్చి వేసింది. సామాజిక సంబంధాలతోపాటు, ప్రకృతి పర్యావరణం ప్రధాన స్థానం ఆక్రమిస్తున్నది. సర్వ విధ్వంసక అణుయుద్ధ ప్రమాదం, పర్యావరణ విధ్వంసం, జనాభా పెరుగుదల, ప్రమాదకరమైన అంటువ్యాధులు యావత్తు మానవాళి సమిష్టిగా సహకరిస్తేగాని పరిష్కరించలేని సమస్యలు కాగా మార్క్సిస్టులు ఒక విషయం మరచిపోరాదు. వర్గపీడన, జాతుల పీడన కొనసాగుతూనే ఉంది. వివిధ ఖండాలలో ఇది అమలుజరుగుతూనే ఉంది. అన్ని ప్రత్యేక సమస్యలకి ఏదో ఒక సాధారణ పరిష్కారం అంటూ ఏదీలేదు.

మా ప్రియతమ నాయకులు హోచిమిన్, మార్క్సిజం, లెనినిజంలో, మా జాతిని, పీడిత ప్రజలను విముక్తి చేసే మార్గాన్ని చూశాడు. ఆయన వియత్నాం కమ్యూనిస్టుపార్టీని ఏర్పరిచాడు. 70 ఏండ్లపాటు జాతీయ విముక్తికొరకు మా దేశంలో పోరాటం జరిగింది. వియత్నాం ప్రజలు ఎన్నో ఘన విజయాలు సాధించారు. ఆ తర్వాత సోషలిస్టు నిర్మాణాన్ని ప్రారంభించారు. ఇతర సోషలిస్టు దేశాలవలెనే, అనేక కారణాలవలన, వియత్నాం కూడా ఒకే సోషలిస్టు నమూనా అనే భావంతో ప్రభావితమై సంక్షోభంలో పడ్డది.

అయితే మా పార్టీ తప్పులను అతి త్వరగా గుర్తించింది. పాత తరహా సోషలిస్టు నమూనాలోని లోపాలను అధిగమించటానికి మార్గాలను వెతికాం. 1988లో మా పార్టీ ఆరవ మహాసభలో, సర్వతోముఖ సామాజిక పునరుజ్జీవన కార్యక్రమం చేపట్టింది. 1991లో ఏడవ పార్టీ మహాసభ పార్టీ రాజకీయ వేదికను అధికార పూర్వకంగా ఏర్పరచింది. లక్ష్యాలను నిర్దేశించింది, సోషలిస్టు పరివర్తనా రూపాలను గుర్తించింది. ఆ రాజకీయ వేదికను రూపొందించటమే వియత్నాం కమ్యూనిస్టుల సృజనాత్మక మార్క్సిజం కృషికి తార్కాణం.

ఈ పునరుజ్జీవన కృషి మూలసూత్రం, మార్క్సిస్టు ఆలోచనా క్రమాన్ని పునరుద్ధరించటం అని ఒక్కమాటలో చెప్పవచ్చు. అనగా తాత్వికంగా మార్క్సిజాన్ని వృద్ధిచేయటం; విమోచన చేయటం, అనగా ఉత్పత్తి శక్తులకు ఆటంకాలుగా ఉన్న వాటినుండి విమోచన చేయటం. ఇందుకుగాను, బహు రంగాల ఉత్పత్తి విధానాన్ని మేము అమలుపరుస్తున్నాము. సోషలిస్టు ప్రభుత్వ ఆధ్వర్యంలో మార్కెట్ యంత్రాంగాన్ని అమలుపరుస్తున్నాము.

మా పునరుజ్జీవన క్రమానికి కేంద్రబిందువు మానవుడు. అన్ని రంగాలలోను విముక్తి చెందిన మానవుడు మా లక్ష్యం. ఈ మానవుడే, అన్ని శక్తులను ముందుకు తీసుకుపోగలడు. సమాజం యొక్క శక్తి, మహత్తరమైన జాతీయ సమైక్యత, ప్రతి వియత్నాం పౌరుని శక్తి సామర్థ్యాలు అపారమైన చోదకశక్తిగా ముందుకు సాగుతున్నాయి. సోషలిజం అభివృద్ధికి ఈ శక్తియుక్తులు తోడ్పడుతున్నాయి. వ్యక్తి యొక్క సంపూర్ణ వికాసం ద్వారానే, అందరి ప్రజల సంపూర్ణ వికాసం సాధ్యమనే కమ్యూనిస్టుపార్టీ మూల సూత్రానికి మేము తిరిగి వెళ్ళాము. అన్ని భౌతికోత్పత్తి కార్యక్రమాలకు చోదకశక్తి, వ్యక్తుల భౌతిక, ఆధ్యాత్మిక, మానసిక అవసరాలను తీర్చటమనే మహత్తర లక్ష్యం. కనుకనే విప్లవంయొక్క ప్రతి దశలోను, కమ్యూనిస్టులు అంతిమ లక్ష్యాలను మాత్రమే దృష్టిలో పెట్టుకుంటే సరిపోదు. ప్రజల తక్షణ ప్రయోజనాలు, వారి భౌతిక మానసిక స్థాయిని పెంచే లక్ష్యాలను గుర్తుపెట్టుకోవాలి.

వియత్నాంలో కమ్యూనిస్టుపార్టీ అధికారంలో ఉంది. కనుక కమ్యూనిస్టుల బాధ్యత వేయిరెట్లు పెరుగుతుంది. యావత్తు జాతియొక్క మొత్తం అభివృద్ధికి కమ్యూనిస్టుపార్టీ బాధ్యత వహించాలి. జాతి ప్రయోజనాలు, పీడితవర్గ ప్రయోజనాలు సమన్వయం చేయాలి. యావత్తు సమాజాన్ని ముందుకు తీసుకుపోయేందుకు కృషి చేయాలి. సోషలిజానికి సాగే ప్రయాణంలో ప్రతి వర్గం, ప్రతి శ్రేణి సహకారం తీసుకోవాలి. దానికి కీలకం కార్మిక, రైతు, మేధావుల సంఘటన. అన్నిరకాల దోపిడీని, అన్యాయాలను, అసమానతలను నిర్మూలించటం ఈ ప్రయాణం అంతిమ లక్ష్యం.

యావత్తు ప్రజలను, జాతిని ముందుకు నడిపించి, మానవుని క్షేమంకొరకు, నాగరిక సమాజ నిర్మాణం కొరకు కృషి చేయాలి.

గత ఆరేండ్లుగా వియత్నాం ప్రజలు సాధించిన విజయాలు, మా పార్టీ విధానం సరైనదేననే నమ్మకాన్ని మాకు కలిగించాయి. మా పునరుజ్జీవన విధానం సూత్రబద్ధంగా ఉండాలని మా స్వానుభవంద్వారానే గుర్తించాము. ఇందులో అతి ముఖ్యమైనదేమంటే, పార్టీ నాయకత్వ పాత్ర కొనసాగింపు, యావత్తు సమాజ

పునర్వికాసం. ఇందులో కీలక విషయమేమంటే రాజకీయ స్థిరత్వాన్ని కాపాడుకోవటం. మార్కెట్ ఆర్థిక విధానం పరిధిలో పనిచేసే బహురూపమైన ఉత్పత్తి రంగాలకు పరివర్తన చెందటం అవసరం. ప్రభుత్వ నిర్వహణ క్రిందనే ఇదంతా ఉండాలి. సామాజిక జీవితం అంతా ప్రజాతంత్రం చేయబడాలి. సోషలిస్టు ప్రభుత్వం చట్టబద్ధ పరిపాలన సాగించాలి. వియత్నాం అన్ని రాజ్యాలతోను "శాంతి, స్వాతంత్ర్యం, అభివృద్ధి లక్ష్యాల కొరకై" మిత్రత్వాన్ని పాటిస్తుంది. ఇది మా విదేశాంగ విధానానికి మూల సూత్రం.

ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితిలో, మార్క్స్, లెనిన్‌లు బోధించిన ప్రపంచ విప్లవశక్తుల ఐక్యత అత్యావశ్యకం. వియత్నాం కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గం అంతర్జాతీయతకు బద్ధురాలై ఉంది. అంతర్జాతీయ కార్మికవర్గ సౌహార్దతకు నిరంతరం కృషి చేస్తూ ఉంటుంది. కమ్యూనిస్టు లక్ష్యాల సాధనకు అవిశ్రాంతంగా కృషిచేస్తుంది.

మార్క్స్ ఒక సందర్భంలో ఇలా అన్నాడు: తన సిద్ధాంతం సమాజాభివృద్ధికి దోహదపడే సిద్ధాంతము అని. అభివృద్ధి క్రమం అనగా అది ఎప్పుడూ ఎంతో కొంత లోపభూయిష్టంగానే ఉంటుంది. మార్క్సిజం, లెనినిజం, హోచిమిన్ ఆలోచనల ప్రాతిపదికగా, మా దేశంలో మార్క్సిజాన్ని పునరుజ్జీవింప చేస్తున్నాము. ఈ వేదిక నిరంతరం, జాతీయ, అంతర్జాతీయ విప్లవోద్యమాల సమైక్యత కొరకు, నేటి పరిస్థితులలో కృషి చేస్తుంది.

---

"ప్రాచీన గ్రీకులలోవలెనే, ప్రాచీన బౌద్ధులలో కూడా ప్రాథమిక గతితర్క బీజాలున్నవి" ప్రకృతి - గతితర్కంలో. —ఎంగెల్స్

---

# సత్తెనపల్లి తాలూకా గ్రామాలలో వచ్చిన ఆర్థిక, సాంఘిక మార్పులు

—శ్రీ మాదల వీరభద్రరావు

నేను ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల గ్రంథం వ్రాయతలపెట్టిన సందర్భముగా, లోగడ ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రొఫెసరు శ్రీ జి. పార్థసారథిగారిని వాల్తేరులో కలుసుకున్నప్పుడు వ్యవసాయ సమస్యలపై నేను వ్రాసిన గ్రంథాలను, వ్యాసాలను వారు పరిశీలించి "1948-49 సంవత్సరము నాటి భూసంబంధాల లెక్కలను" అదే ప్రశ్నావళి ఆధారముతో అవే గ్రామాలలో మరల అధ్యయనం చేయడం (Comparative Study) ముఖ్యమని సూచించారు. ఆ గ్రామాలలోనే రిసర్వే చేయమని నన్ను ప్రోత్సహించారు.

## లోగడ సర్వే చేసిన గ్రామాలు

గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో వివిధ గ్రామాలలో నేను కొంత వరకు ఆర్థిక - సాంఘిక సర్వే చేశాను. ఆ గ్రామాలు ఇవి :

1. పాలడుగు, 2. డోకిపర్రు (ఫిరంగిపురం ఫిర్కా), 3. మాదల 4. ఇరుకుపాలెం 5. పణిదెం 6. రెంటపాళ్ల (సత్తెనపల్లి ఫిర్కా) 7. బాలేమర్రు (పెదకూరపాడు ఫిర్కా) 8. గుడిపాడు, 9. నాగవరం, 10. చౌటపాపాయపాలెం, 11. బన్నాయపాలెం, 12. గణపవరం (బెల్లంకొండ ఫిర్కా) 13. దొండ్లేరు, 14. శివారు, 15. ఆవులవారి పాలెం (అచ్చంపేట ఫిర్కా).

## సేకరించిన లెక్కలు

ఈ గ్రామాలలో జనాభా, ఎవరెవరి క్రింద ఎంతెంత భూమి ఉంది ? భూమి

శిస్తు విధానము, సేద్యమెంత? పైరు వారీ లెక్కలు, పొలాల మార్పిడులు, అమ్మకాలు, భూమి అమరకపు పద్ధతులు, అప్పులు, వివిధ వర్గాల ఆర్థిక జీవన పరిస్థితులు మున్నగు అంశాలతో గూడిన ప్రశ్నావళిని తయారుజేసి అందుకు సంబంధించిన లెక్కల వివరాలను సేకరించాను. సత్తెనపల్లి ఫిర్కాలోని వంద ఎకరాలు గల ఒక భూస్వామికి, 22 ఎకరాలు గల మధ్యతరగతి రైతుకి, ఐదు ఎకరాలు గల పేద రైతుకి వ్యవసాయము మీద వచ్చే ఆదాయ - వ్యయాలను కూడా సేకరించాను.

## ప్రచురించిన పుస్తకాలు

ఈ 15 గ్రామాల భూ సంబంధాల లెక్కలను "తాలూకా వ్యవసాయ సమస్యలు 15 గ్రామాల భూసంబంధాల లెక్కలు" అను పేర ఒక పుస్తకాన్ని 1952 లో ప్రకటించాను.

"తాలూకా రైతుకూలి ఆర్థిక సమస్యలు, వ్యవసాయ సంస్కరణలు" అను నా రెండవ గ్రంథాన్ని 1953లో వెలువరించాను. ఈ గ్రంథములోని మొదటి భాగములో తాలూకాలో భూవిధానము ఎలా ఉంది, భూమిశిస్తు, వర్షపాతం, పంటలు, నీటి వనరులు ఏమిటి ? రాకపోకల రవాణాసౌకర్యాలేమి ? జనాభాలో వర్గ విభజన, వ్యవసాయాదాయ స్థితిగతులు ఎలాగున్నవి ? ఇచ్చట కరువు కాటకాలు, భూమి హక్కు విషయంలో ప్రభుత్వ వైఖరి ఏమి ? వ్రాశాను.

రెండవ భాగములో గ్రామాలలోని వివిధ వర్గాల జీవన పరిస్థితులు, ధనిక భూస్వాముల పీడనావిధానం ఎలా ఉన్నదీ వివరించాను. ధరల పెరుగుదలల - తరుగుదలల కాలలాలో 1939వ సంవత్సరము యుద్ధాత్పూర్వ స్థాయి కంటె కూడా ప్రజల జీవన ప్రమాణము ఎంత తగ్గింది ? రైతులు, కూలీలు, పాలేరులు, వృత్తిదార్ల యొక్క కష్టాలు, ఒక్కొక్క వర్గమువారు ద్వితీయ యుద్ధ కాలములో, యుద్ధానంతరం, నేడు ఏ పరిస్థితులలో ఉందీ, తాలూకాలోని వ్యవసాయార్థిక పరిస్థితుల తీవ్రతను గురించి విపులీకరించాను.

మూడవ భాగంలో రైతాంగాన్ని ఎదుర్కొంటున్న అగ్రహారందారి సర్వీస్ ఈనాముల సమస్యలను, అధికాహారోత్పత్తికి అవసరమైన బంజరుల సాగు, ఇరిగేషన్ సౌకర్యాలను గురించి వ్రాశాను.

వ్యవసాయ సమస్యా పరిష్కారానికై తాలూకాలో అమలు జరుపవలసిన భూసంస్కరణలు ఎలా ఉండాలి ? భూమి పునర్విభజన, కవులుదారుల శాసనము, కనీస కూలి నిర్ణయం, భూమి పన్నుల విధానం ఎలా ఉండాలి, తాలూకాలో ఒక ఆర్థిక భూఖండం నైజం ఎంత ఉండాలి ? భూమి గరిష్ట ప్రమాణం ఎంత ఉండాలి ? అను ప్రధాన విషయాలు పేర్కొన్నాను.

ఇందులో బాలేమ్రు గ్రామములో రైతుల వ్యవసాయ ఆదాయం, మేడి కొండూరులో కూలి రేట్లు, పని గంటల వివరాలు, సత్తెనపల్లి పట్టణ మార్కెటులోని ధరల ఎగుడుదిగుడులు, వడ్డవల్లి గ్రామములోని వివిధ తరగతుల ఈనాముల పరిస్థితులు మొదలగు ఛార్టులను పొందుపరిచాను.

## లెక్కలను ఎలా సేకరించాను ?

ఆయా గ్రామాల భూసంబంధాల లెక్కలను ఎలా సేకరించానో వివరిస్తాను. మొదట తాలూకా ఆఫీసులో గ్రామోద్యోగుల వద్దనున్న జనాభా లెక్కలు, అడంగులు, పైరువారి లెక్కలను తీసుకున్నాను. తర్వాత, గ్రామంలో ఈ విషయాల యందు ఆసక్తిగల రైతు శ్రేయోభిలాషులను, ఉపాధ్యాయులను సమావేశ పరచి వారితో జరిపిన చర్చల పర్యవసానంగా గ్రామ పరిస్థితులను గూర్చి ఒక అవగాహనకు రావడం జరిగింది.

కాస్త తీరుబడి ఉండే ఎండాకాలంలో రాత్రి వేళల కూలీ పాలేరులను, వృత్తిదారులను, రైతుకూలి కార్యకర్తలను సమావేశపరచి వ్యవసాయార్థిక లెక్కలను వివరించి, వారి అనుభవాలను కూడా తెలుసుకొని పూర్వ లెక్కల తప్పు, ఒప్పులను సరిజేసుకొనడం జరిగినది. ఈ విధంగా మూడు అంచెలుగా జరిగిన విషయ సేకరణలను పరిశీలించి, కళాశాల విద్యార్థుల సహకారంతో ఛార్టులు మొ॥ తయారు జేశాను.

అనంతరం ఆ పరిశీలనా ఫలితాలను రెండు వేరువేరు పుస్తకాలుగా మిత్రుల సహకారంతో ప్రచురించాను.

## నూతన పరిణామాలు

1948-49 సంవత్సరాలలో సేకరించిన ఆ లెక్కల తర్వాత రాష్ట్రంలోను, దేశంలోను అనేక పరిణామాలు సంభవించినవి.

1. అగ్రహారాల, ఈనాముల రద్దు, కవులుదారీ శాసనాలు, కనీస కూలి నిర్ణయం, భూ గరిష్ట పరిమితుల చట్టం, బంజరులు సాగుకివ్వడం మున్నగు వ్యవసాయ సంస్కరణలను ప్రభుత్వము అమలు జరిపింది. ఈనాముదారీ విధానం రద్దు అయి రైత్వారీ పద్ధతి ప్రవేశపెట్టబడింది. కవులుపాలు పద్ధతులలో మార్పులు వచ్చినవి.

2. నాగార్జునసాగరు మరికొన్ని చిన్న ప్రాజెక్టులు నిర్మాణము గావించిన ఫలితంగా లోగడ కేవలం వర్షాధార మెట్టభూములయిన పొలాలు నేడు మాగాణి భూములయినవి. విద్యుచ్ఛక్తి గూడ లభించుచున్నది. ఆహార వ్యాపార పైరులు

వేసే పద్ధతులలో కూడ చాలా మార్పులు వచ్చినవి. తత్ఫలితంగా వ్యవసాయాధార పరిశ్రమలు గూడా ఈ ప్రాంతములో ఇప్పుడిప్పుడే కాస్త అభివృద్ధి అవుతున్నవి.

3. లోగడ సర్వే చేసిన గ్రామాలలో వ్యవసాయార్థిక స్థితిగతులలో కూడ కొంత మార్పు కనిపిస్తుంది. అందుచేత నాటికి నేటికి (గత 30 ఏళ్లలో) తాలూకా భూసంబంధాలలో వచ్చిన మార్పులు పైగల మార్పిడులు, వ్యవసాయార్థిక స్థితి గతులు మున్నగు వాటిని తిరిగి సర్వే చేయడం ముఖ్యం. 1948-49లో నేను తయారు చేసిన ప్రశ్నావళి ఆధారముగా ఆ గ్రామాలలోనే రీసర్వే చేయడం అవసర మని, నిర్దుష్ట జాతీయ ప్రణాళిక రూపకల్పనకు సైతం ఈ విధమైన నమూన సర్వేలు అత్యంత ప్రయోజనకరంగా ఉండగలవని భావిస్తున్నాను.

## సత్తెనపల్లి ప్రాంతంలో

ఈ సర్వే ఫలితంగా గత 34 సంవత్సరాలకూ - యిప్పటికి కొన్ని ముఖ్య మైన మార్పులు స్థూలంగా కనిపిస్తున్నాయి.

1. గ్రామాలలో అభివృద్ధి వచ్చింది. ఊళ్ల దగ్గరగా రోడ్లు ఏర్పడ్డాయి. బస్సు సౌకర్యం కల్గింది. గ్రామంలో ప్రాథమిక పాఠశాలలు, సమీపంలో హైస్కూళ్లు వెలసినవి. అన్నిచోట్ల పోస్టాఫీసులు అమరినవి. దగ్గరలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, గ్రామంలో హెల్తు విజిటర్లు వచ్చారు. పంచాయితీ రాజ్య వ్యవస్థ ఏర్పడిన తదుపరి కొన్ని అభివృద్ధి కార్యక్రమాలు అమలుజరుగుచున్నవి.

2. నాగార్జున సాగర్ ప్రాజెక్టు కాలువల మూలంగా ఈ ప్రాంత మెట్ట భూములు మాగాణి అయినాయి. రైతులు వెనకటి మెట్టపైర్లు జొన్న, సజ్జ, వరిగ మొ॥ వేయడం మానివేసి, వరి, ప్రత్తి, మిర్చి, పసుపు మున్నగు పైర్లు వేస్తున్నారు. అయితే, కాలువల చివరి భాగాలకు నీరు సక్రమంగా అందక, ఏటా ఇబ్బందులకు గురవుతున్నప్పటికీ, వెనకటి కంటే హెచ్చు పంటలు పండుతున్నవి. ఎక్కువ ఆదాయం కూడా వస్తున్నది.

3. గ్రామాలకు విద్యుత్ సరఫరా అవుతున్నది. నీరు అందని వారు లిఫ్టు ఇరిగేషన్‌లకు ప్రయత్నిస్తున్నారు. హరిజనవాడలకు కూడా విద్యుత్ సౌకర్యం ఏర్పడింది. కాని వ్యవసాయాధార పరిశ్రమలు ఏర్పడలేదు యింకా.

4. భూ యాజమాన్య పద్ధతులలో మార్పు:

భూ కేంద్రీకరణలేదు. చేయగల శక్తికి మించి పొలం వున్న పెద్ద రైతులు భూములు అమ్ముకుంటున్నారు. కొంత బీడు పెట్టి, కొంత కౌళ్లకు ఇచ్చి చేయించు కొంటున్నారు. వ్యవసాయ కూలీలు, బీదలు ఆ పొలాలు కొనుక్కుంటున్నారు. ఫలితంగా చిన్న కమతాలు ఏర్పడ్డాయి. భాగ పంపిణీల వల్ల కూడా పొలాలు

ముక్కలైనవి. ఇది ముఖ్యంగా కనిపిస్తున్న మార్పు. భూ కమతాల లెక్కలను, వివరాలను వివరంగా పరిశీలిస్తున్నాము.

5. ఎక్కువ పొలం వున్న పెద్ద రైతులకు తక్కువ పంట రాలుబడి, తక్కువ పొలంగల చిన్న రైతులకు హెచ్చు పంట రాలుబడి వున్నట్లు తేలింది. (ఈ విషయం యింకా లోతుగా పరిశీలించవలసి ఉంది).

6. దగ్గరలో పరిశ్రమలు ఏర్పడినచోట్ల (డోకిపర్రు, రెంటపాళ్ల) అచ్చట కూలీ కుటుంబాల ఆదాయం హెచ్చింది. వారి జీవన సరళిలో కూడా కొంచ మార్పు వచ్చింది. కాని కొలది కూలీ కుటుంబాలు మాత్రామే ఈ ప్రయోజనం పొందు తున్నాయి. ఎక్కువ మంది వ్యవసాయ కూలిపైనే ఆధారపడి వున్నారు.

7. గ్రామాలలో విద్యావంతుల సంఖ్య వెనుకటి కంటే పెరిగింది. కొందరు ఉద్యోగాలు చేస్తున్నారు. ఫలితంగా కొన్ని కుటుంబాల ఆర్థిక స్థితి మెరుగైంది. షెడ్యూల్డు కులాల, జాతుల వారిలో బహు కొలది మంది తప్ప అధిక సంఖ్యాకు లలో పెద్ద మార్పు రాలేదు. ఉద్యోగాలు చేస్తున్నవారి Life Style వేరైంది. పట్టణవాస నాగరికతకు అలవాటుపడినవారు గ్రామీణ బీదరిక నివారణకు శ్రద్ధ చూపడంలేదు.

8. గ్రామాలలో ఇటీవలి కాలంలో రాజకీయ, సాంఘిక చైతన్యం పెరిగింది. తమ హక్కుల కోసం గట్టిగా కోరుతున్నారు. అంటరానితనాన్ని పాటించడంలేదు. కుటుంబ నియంత్రణను, గర్భనిరోధాన్ని పాటిస్తున్నారు. ఇద్దరు బిడ్డలు కలుగగానే ఆపరేషనులు చేయించుకొంటున్నారు. గ్రామాల్లో మత తగాదాలు, కలహాలు లేవు. అప్పుడప్పుడు పట్టుదలల మూలంగా తగాదాలు ఉత్పన్నమవుతున్నా గ్రామస్థులు సాధారణంగా సర్దుకొనిపోతున్నారు. కొన్ని గ్రామ తగాదాలువల్ల హరిజనులను, వడ్డెరలను కూడా సర్పంచ్‌లుగా ఎన్నుకోవడం జరుగుచున్నది. అయితే, ఆ సర్పంచ్‌లు కూడా తమ స్వార్థం చూచుకొంటున్నారు గాని, తోటి పేదల బాగోగులు పట్టించుకోవడం లేదు.

9. ప్రభుత్వ వ్యవసాయ సంస్కరణల వల్ల ఈ గ్రామాల్లో పెద్దగా ఒరిగిందేమీ లేదు. గరిష్ట పరిమితికి మించి, అదనపు భూమి పంచిందేమీ లేదు. అగ్రహారం, ఈనాం పట్టాల వల్ల, చట్టరీత్యా రైతులకు ఒరిగిందేమీ లేదు. అయితే ఈ చట్టాల బెదురు మూలంగా అగ్రహారందార్లు, భూస్వాములు తమ భూములను తక్కువ రేట్లకు అమ్ముకొని కొంత సొమ్ము చేసుకున్నారు. లోగడ ఆ భూములు చేసేవారు, రైతులు కొనుక్కొని పట్టాలు పుట్టించుకొని బాగుపడ్డారు. అన్నీ మాజువాణిగా నిర్ణయించిన కనీస వ్యవసాయ కూలీ రేటు కంటే గ్రామాల్లో రోజు కూలీ రేటు ఎక్కువగానే వుంది.

వృద్ధాప్య పింఛనులు, అనాధుల పెన్షనులు బహు తక్కువ మందికి లభిస్తున్నవి. 60 ఏండ్లు మించిన వ్యవసాయ కూలీలు దరఖాస్తులు పెట్టుకున్నారు గాని, అవి యింకా మంజూరై రాలేదు.

10. హరిజనులకు, వెనుకబడిన తరగతుల వారికి ఇండ్ల స్థలాల నిమిత్తం భూములు యిచ్చారు. ప్రభుత్వం పక్కా యిళ్లు కట్టించిన వాటిల్లో వుంటున్నారు. పూరి ఇళ్ళకు సహాయం అందించిన ప్రదేశాల్లో కొన్నిటిలో చేరలేదు. ఖాళీగానే వున్నవి.

11. వెనుకటి కంటే కూలి రేట్లు బాగా పెరిగినవి. కాని ఏడెల్లకాలం పని దొరకడం ముఖ్యం. ఇతర ఉప వృత్తులు బాగా ఏర్పడలేదు. అందుచే స్వంత పొలం లేని కూలీలలో నిరుద్యోగం వుంది Economic disparity పెద్దగా తగ్గలేదు. (ఈవిషయం ఇంకా పరిశీలించవలసి వుంది).

12. గ్రామాలలో, సమితి కార్యాలయాల్లో సమాచార కేంద్రాలు లేవు. ప్రభుత్వం తలపెట్టిన సహాయ కార్యక్రమాలు గ్రామీణులకు తెలియటం లేదు.

అభివృద్ధి పనులు అమలు జరిపే ఏజెన్సీ లేదు. ప్రణాళికా రచన కూడా పైనుంచి నిర్ణయించడం జరుగుతున్నందున, గ్రామీణ అవసరాల ప్రాధాన్యతను గుర్తించడం లేదు. గ్రామాభివృద్ధిని, బీద ప్రజల స్థితిగతులను దృష్టిలో వుంచుకొని కార్యక్రమాలు రూపొందించకపోవడంచేత, ఉద్దేశించిన మంచి ప్రయోజనాలను కూడా వారు పొందలేక పోతున్నారు.

# మార్క్సిజం సజీవశాస్త్రం

## కలకత్తా సెమినార్‌లో సి. పి. ఐ. సమర్పించిన పత్రం

[మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ ఆహ్వానంపై కలకత్తాలో మే 5, 6, 7 తేదీలలో "వర్తమాన ప్రపంచ పరిస్థితులు - మార్క్సిజం ప్రాధాన్యత" అన్న అంశంపై సదస్సు జరిగింది. ఈ సదస్సుకు 31 దేశాల కమ్యూనిస్టు పార్టీలను ఆహ్వానించగా 21 దేశాల పార్టీలు హాజరయ్యాయి, 10 దేశాల పార్టీలు అధ్యయన పత్రాలను, సందేశాలను పంపాయి. భారత కమ్యూనిస్టు పార్టీ తరపున ఇంద్రజిత్ గుప్త, ఎమ్. పరూఖీ, ఎ. బి. బర్దన్ గార్లు పాల్గొని తమ అధ్యయన పత్రాన్ని సమర్పించారు. ఈ పత్రంలోని అంతర్జాతీయ విభాగాన్ని పాఠకులకు అందజేస్తున్నాం].

భారతదేశ పరిస్థితితో ఈ పత్రాన్ని ప్రారంభించాము. ఇప్పుడు అంతర్జాతీయ పరిస్థితిపట్ల దృష్టి సారించుదాము. ముందుగా, దక్షిణాఫ్రికా కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ క్రిస్ హానీ హత్యకు గురికావటంపట్ల మా ప్రగాఢ విచారాన్ని వ్యక్తంచేస్తున్నాం. ఇటువంటి ముఖ్యమైన సెమినార్‌లో ఆయనలేని లోటు మనకు కనిపిస్తున్నది. అయితే అప్రతిహతమైన అతని స్ఫూర్తి మనతో వుంది.

### క్రిస్‌హానీకి జోహార్లు

దక్షిణాఫ్రికాలో కొనసాగుతున్న సంప్రదింపులను విచ్ఛిన్నం చేయటానికి, స్తంభింపచేయటానికి, స్వేచ్ఛను, ప్రగతిని నిరోధించటానికి, నయా ఫాసిస్టులు, వారి అంతర్జాతీయ ప్రోత్సాహకులు ఎంత నీచానికి దిగజారగలరో ఈ హత్య చాటి చెబుతున్నది. ఇటీవల దినాల్లో ఏ ఒక్క ఘటన కూడా ఈ కమ్యూనిస్టు నాయకుని ఆత్మబలిదానం కలిగించినటువంటి ప్రజా వెల్లువను తీసుకురాలేదు. బలమైన మనో భావాలను రేకెత్తించలేదు. దక్షిణాఫ్రికా ప్రజలలోగల ఐక్యతా భావాన్ని అంత

శక్తివంతంగా ప్రదర్శించలేదు; అటువంటి అంతర్జాతీయ సంఘీభావాన్ని తీసుకు రాలేదు.

ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ తన ప్రకటనలో ఇలా చెప్పింది: "కామ్రేడ్ క్రిస్ హానీ తన యావజ్జీవితాన్ని దక్షిణాఫ్రికాలో ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ కొరకు పోరాటానికి అంకితం చేసిన వ్యక్తి. ఆయన ఎ. ఎన్. సి., ఎస్. ఎ. సి. పి. లు రెండింటికీ విశిష్టతతో, గొప్ప సాహసంతో, అచంచలమైన విధేయతతో సేవ చేశారు."

ఆయన కుటుంబానికి చెందిన వారమైనందుకు మేము గర్వపడుతున్నాం. గౌరవంగా భావిస్తున్నాం. ఆయన దృఢమైన, సరళమయిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకుందాం: "నేను దేనికొరకు పోరాడుతున్నానో, ఏ భావజాలం కొరకు నేను నిబద్ధుడనో నాకు ఖచ్చితంగా తెలుసు."

క్యూబాలో ఇటీవల జరిగిన ఎన్నికలలో ప్రజాస్వామ్యం విజయం పొంద టంపట్ల ఈ సందర్భంగా మేము హర్షం వ్యక్తం చేస్తున్నాం. క్యూబన్ ప్రజలు అసాధారణమయిన గడ్డు పరిస్థితుల్లో తమ విప్లవం, సోషలిజం, కమ్యూనిస్టు పార్టీ పట్ల, దాని సాహసోపేత నాయకత్వంపట్ల ఎంత శక్తివంతమయిన నైతిక, రాజకీయ ఐక్యతను వ్యక్తం చేశారో ఈ ఎన్నికలు నిరూపించాయి.

అణు శీర్షాలతో దక్షిణ కొరియా-అమెరికా సంయుక్త సైనిక విన్యాసాల రూపంలో జరిగిన అణ్వాయుధ బెదిరింపును, అంతర్జాతీయ అణు ఇంధన సంస్థ ద్వంద్వ ప్రమాణాలనూ, "అణు తనిఖీ" సమస్యపై అది తెచ్చిన ఒత్తిడిని ధైర్యంగా ఎదుర్కొని నిలబడిన కొరియా ప్రజాతంత్ర ప్రజా రిపబ్లిక్‌తో మా సంఘీభావాన్ని వ్యక్తం చేస్తున్నాము.

## చైనా, వియత్నాంలలో జరుగుతున్న అభివృద్ధి

చైనాలో జరుగుతున్న అద్భుతమయిన అభివృద్ధిని ఎంతో ఆసక్తితో మేము గమనిస్తున్నాము-దాని ఆర్థికాభివృద్ధి రేటు చాలా హెచ్చుగా వుంది; దాని వాణిజ్యం వేగంగా విస్తరిస్తున్నది; బి. ఓ. పి. పరిస్థితి (ఎగుమతి - దిగుమతి వ్యాపారంలో వ్యత్యాసం) సానుకూలంగా వుంది; స్వావలంబనకు అవరోధం కలుగకుండా ఇతర దేశాల ప్రవేశాన్ని అనుమతిస్తున్నారు; ప్రణాళికను సోషలిస్టు మార్కెట్‌తో సంలీనం చేసే పద్ధతిని అది అనుసరిస్తున్నది. అలాగే దాని జనాభా నియంత్రణ చర్యలు వగైరా కూడా ఆసక్తి కలిగిస్తున్నాయి. చైనా పార్టీ కామ్రేడ్స్ వక్కాణించినట్లు మార్క్సిస్టు-లెనినిస్టు భావజాలానికి, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానికీ,

లిస్టు వ్యవస్థకు కట్టుబడి వుండటంద్వారా చైనా యొక్క నాలుగు ఆధునికీకర ణలు సాధించబడుతున్నవి.

వియత్నాం కూడా సోషలిస్టు వ్యవస్థలోనే సంస్కరణలు తీసుకురావటం ద్వారా తన ఆర్థిక ఇబ్బందులను అధిగమించగలిగింది. ఉత్పత్తిని పెంచగలిగింది. మిగులు బియ్యం ఎగుమతి చేస్తున్నది. ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయగలిగింది.

ప్రతి సోషలిస్టు దేశం కూడా మార్క్సిస్టు భావజాలం, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం మార్గదర్శకత్వంలో, తన ప్రత్యేక లక్షణాలను, నిర్దిష్ట పరిస్థితిని పరిగణనలోకి తీసుకుంటూ తన స్వంత మార్గంలో పురోగమిస్తున్నట్లు మనం గమనిస్తున్నాము.

ముగింపునకు వస్తున్న శతాబ్దం – 20వ శతాబ్దం అంతకుముందు అనేక శతాబ్దాల కాలంలో జరిగిన ప్రతి ఒక్క దానికన్నా మిన్నగా ప్రపంచాన్ని మార్చిన, రూపుదిద్దినటువంటి ఘటనలను, పరిణామాలను, యుద్ధాలను, విప్లవాలను, విముక్తి, స్వేచ్ఛకొరకు ఉద్యమాలను, శాస్త్ర, సాంకేతిక పురోగతిని చూసింది. ఈరోజు ఘటనల వేగం ఎంతగానో పుంజుకున్నది.

## స్వీయాత్మక ధోరణి : వినాశకరమైన తప్పిదాలు

దురదృష్టవశాత్తు మన అవగాహన ఈ శీఘ్రంగా మారుతున్న ఘటనల వేగాన్ని అందుకోలేకపోయింది. ఎంతో మూల్యంతో కూడిన వినాశకరమయిన తప్పిదాలకు మూలం ఇదే.

సమకాలీన ప్రపంచం గూర్చిన మన అవగాహనలో చాలా మేరకు స్వీయాత్మకత, కొంత మేరకు సిద్ధాంత పరమయిన తేలిక ధోరణి వుంది. సోవియట్ 'నమూనా' సోషలిజంలోగల ప్రతికూల లక్షణాలను మనంచూడటానికి నిరాకరించాం, దాటవేశాం. మరోవైపున, తన లాభాల కొరకు అన్వేషణలో, తన జీవిత కాలాన్ని పొడిగించుకోవటంలో పెట్టుబడిదారీ వ్యవస్థకున్న శక్తియుక్తులను, శాస్త్ర–సాంకేతిక విజ్ఞాన విజయాలసున సాధించటంలో, అనుసరించటంలో, ఉపయోగించుకోవటంతో, దానికున్న సామర్థ్యాన్ని మనం చాలా తక్కువ అంచనా వేశాం. పెట్టుబడిదారీ వ్యవస సార్వత్రిక సంక్షోభం దాని ప్రత్యేక సంక్షోభం పెట్టుబడిదారీ వ్యవస్థ విధిగా కుప్పకూలి పోవటానికి దారితీస్తుందని, చూడగలిగిన భవిష్యత్‌లో సోషలిజం దానిని అధిగమిస్తుందని తప్పు విశ్వాంస వుండింది.

సమకాలీన ప్రపంచంలో, ప్రతి దేశంలో ముఖ్యంగా రెండవ ప్రపంచ యుద్ధానంతరం సంభవించిన అత్యంత జటిలమయిన పరిణామాలను లోతుగా,

శాస్త్రీయంగా, నిర్దిష్టంగా అధ్యయనం చేయకుండా ఇది నిరోధించింది.

అపారంగా నాశనమయిన పాదార్థిక సంపదను యుద్ధానంతరం పునరుద్ధరించవలసిన అవసరాన్ని అవకాశాన్ని, కొత్తగా విముక్తిపొందిన దేశాలలో, వర్ధమాన దేశాలలో తాజా మార్కెట్లు ఆవిష్కృతమయినందున ఉత్పత్తి, వ్యాపార, వాణిజ్య విస్తరణకుగల అవకాశాన్ని; సోషలిస్టు దేశాల ప్రభావంవల్ల పెట్టుబడిదారీ దేశాలలో శ్రమజీవులకు మెరుగైన వేతన వ్యవస్థ ఏర్పడటం, సాంఘిక భద్రతా ఏర్పాట్లు మెరుగుకావటం-వీటివల్ల వారి కొనుగోలు శక్తి పెరగటాన్ని; సాంకేతిక విజ్ఞానంలో వచ్చిన విప్లవాత్మకమయిన పురోగతివల్ల పెట్టుబడులు పెట్టటానికి కొత్త అవకాశాలు ఏర్పడటాన్ని గమనించటంలో మనం విఫలమయినాము. చివరిదే అయినా అప్రధానమయినది ఎంతమాత్రంకాదు. అదేమంటే, వేగం పుంజుకున్న ఆయుధ పోటీ ఉత్పత్తి శక్తులను, ఉత్పత్తిని గణనీయంగా విస్తరించటానికి, ఆధునీకరించటానికీ, సమాచార కమ్యూనికేషన్ పద్ధతులలో గొప్ప మార్పు తీసుకురావడానికి పెట్టుబడిదారీ వ్యవస్థకు యుద్ధానంతర ప్రపంచంలో సహాయపడింది. అందువల్ల అది సాంప్రదాయకమైన మాంద్యాన్ని, సంక్షోభాన్ని కొంతకాలంపాటు నిలుపు చేయగలిగింది.

## సోవియట్ వైఫల్యం

ఈ అంశాలు, పెట్టుబడిదారీ వ్యవస్థలో అంతర్భాగంగా వుండే వైరుధ్యాలను తొలగించలేకపోయినప్పటికీ, ఆ వ్యవస్థ సాపేక్షిక సుస్థిరతకు దోహదం చేశాయి. అయితే అవి కొన్ని విభాగాలలో భ్రమల బీజాలు నాటాయి.

సోవియట్ శాస్త్రజ్ఞులు కూడా శాస్త్ర-సాంకేతిక విప్లవం (ఎస్.టి.ఆర్) యొక్క అనేక రంగాలలో పెట్టుబడిదారీ ప్రపంచంలోని విజయాలను తలదన్నే అనేక మార్గదర్శకమయిన, తొట్టతొలి అన్వేషణలు సాధించారు. అయితే అధికంగా కేంద్రీకృతమైవున్న బ్యూరోక్రటిక్ వ్యవస్థ ప్రజలు చైతన్యయుతంగా పాల్గొనడాన్ని,ఎస్.టి.ఆర్ విజయాలను అనువర్తింపజేయటంలో చొరవ ప్రదర్శించటాన్ని నిరోధించింది. దీనితో సోషలిస్టు మార్కెట్‌నుండి ఉత్పత్తి పూర్తిగా వేరుపడిపోయింది. ఉన్నత ఆర్థిక వ్యవస్థకు గీటురాయిగా ఎవరైనా ఆశించేటటువంటి ఇతోధిక సామర్థ్యాన్ని, హెచ్చు ఉత్పాదకతను సాధించటంలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ విఫలమయింది.

పెట్టుబడిదారీ దేశాలు తమ జనాభాలోని మధ్యతరగతుల జీవన ప్రమాణాలలో (అగ్రస్థానంలోని కొద్దిమంది ధనికులకు చేకూర్చిన అపారమయిన సంపద గూర్చి వేరుగా చెప్పనవసరంలేదు) సాపేక్షికంగా మెరుగుదల తీసుకు రాగలిగాయి. ఈ విభాగాల సామాజిక స్వభావంయొక్క 'వినియోగతత్వ' కాంక్షలను,

అవసరాలను తీర్చటానికి పెట్టుబడిదారీ 'మిఠాయి దుకాణాల' నుంచి అనేక 'మిఠాయిల'ను వారికి యివ్వజూపగలిగాయి. ఈ విషయంలో సోషలిస్టు వ్యవస్థ వైఫల్యం సామాజిక అభివృద్ధికి స్వేచ్ఛా మార్కెట్ తారకమంత్రమన్న వాదనకు విశ్వాసయోగ్యతను కలిగించింది.

## పెట్టుబడిదారీ వ్యవస్థలో వైరుధ్యాలు

పెట్టుబడిదారీ వనంలో అంతా పచ్చగానే వుంటుందని సులువుగా దగాపడే వారు మాత్రమే విశ్వసించారు. పెట్టుబడిదారీ దేశాలలోని పచ్చి నిజాన్ని-పెరుగుతున్న మాంద్యం, ఫ్యాక్టరీల మూసివేతలు, ఉద్యోగాల తగ్గింపు, పెచ్చుపెరుగుతున్న నిరుద్యోగం, ఉద్యోగ నియామకాలు-తొలగింపులలో లింగ, వర్ణ వివక్షత, జాతి కలహాలు, వలస వచ్చిన కార్మికులకు వ్యతిరేకంగా నయా-నాజీల దాడులు, విచ్చలవిడి లంచగొండితనం వగైరా దాచిపెట్టగల స్థితిలో పశ్చిమ దేశాల ప్రచార సాధనాలు కూడా ఈనాడు లేవు. కొద్దిమందికి లాభాలపై ఆధారపడిన వ్యవస్థ యొక్క మానవత్వరహిత ప్రభావం అందరికీ కనిపిస్తున్నది.

1977-1989 మధ్యకాలంలో, ఆర్థిక వ్యవస్థ దిగువ అర్థభాగంలోని కుటుంబాల వేతనాలు పడిపోగా, అగ్రస్థానంలోని సంపన్నులు అసాధారణంగా 200 బిలియన్ డాలర్ల నూతన ఆదాయాన్ని సమకూర్చుకున్నారని అమెరికాకు చెందిన ఐక్య గని కార్మికుల పత్రిక (నెం. 7/92) తెలియజేసింది.

ఉన్నతస్థానంలోని 500 కంపెనీలు గత దశాబ్దకాలంలో దాదాపు 40లక్షల కార్మికులను పనినుండి తొలగించినట్లు 'ఫార్ట్యూన్' పత్రిక తెలిపింది.

మధ్యతరగతి నుండి ఉన్నత తరగతికి ఆదాయ మార్పిడి జరిగింది. 1991 నాటి డాలర్ విలువ ప్రకారం, కార్మికుని సగటు వారం వేతనం 1973 నాటి స్థాయితో పోల్చితే దాదాపు 100 డాలర్లు పడిపోయిందని ఎ. ఎఫ్. ఎల్. సి. ఎల్.ఒ, పరిశోధకులు తెలియజేశారు.

సాంఘిక భద్రత, ఆరోగ్య సంరక్షణ వ్యవస్థలు రీగన్-బుష్ సంవత్సరాల నుండి కోతకు గురైనాయి. పన్నుల భారం సంపన్నుల భుజాల నుండి బలహీనుల పైకి మరలించబడింది. ఉత్తర అమెరికన్ స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం ద్వారా ఉద్యోగాలు తక్కువ వేతనాలు చెల్లించే ఇరుగు పొరుగు దేశాలకు 'ఎగుమతి' చేయబడినాయి. అధ్యక్షుడు క్లింటన్ ఎన్నికలకు ముందు ఇచ్చిన వాగ్దానాలకు ఏమి గతి పడుతుందో వేచి చూడవలసిందే.

పోటీపడుతున్న యూరప్ సమాజం (ఇ. సి.) జపాన్‌ల నుండి, తృతీయ ప్రపంచ దేశాలనుండి సైతం తన మార్కెట్లను కాపాడుకుంటున్న అమెరికా, మాంద్యంలో కొట్టుమిట్టాడుతున్న తన పరిశ్రమల, ఉత్పత్తులను, కుమ్మరించటానికి "స్వేచ్ఛా మార్కెట్" కొరకు, వర్ధమాన తదితర దేశాల మార్కెట్లతో నిర్నిబంధ సంబంధం కొరకు పిలుపు ఇస్తున్నది. ఇందుకొరకు అది రాజకీయ, ఆర్థిక బెదిరింపును, అది అజమాయిషీ చేస్తున్న ద్రవ్య సహాయక సంస్థల అపారమైన శక్తిని ఉపయోగిస్తున్నది.

ఇ. సి. దేశాలలో ఈ సంవత్సరపు ఆర్థికాభివృద్ధి అంచనా కేవలం 0.8 శాతం; 1994 లో ఇది కేవలం 1.8 శాతానికి పెరుగుతుందని ఆశిస్తున్నారు.

ఇ. సి. సగటు నిరుద్యోగం ఈ సంవత్సరం 11 శాతానికి పెరిగింది.

జపాన్‌లో, ఐ. ఎల్. ఓ. నివేదిక ప్రకారం స్థూల ఉపాధి 2,50,000 పడిపోయింది.

ఇంగ్లండ్‌లో గనుల మూసివేత, రైలు ప్రైవేటీకరణ, ఇంకా అటువంటి ఇతర చర్యలకు వ్యతిరేకంగా వీరోచితమైన, దీర్ఘకాల పోరాటం సాగుతున్నది. ఈ పోరాటం ట్రేడ్ యూనియన్‌లలోని విస్తృత విభాగాలను, రాజకీయ అభిప్రాయాలతో నిమిత్తం లేకుండా విశాలమైన ప్రజానీకాన్ని సమీకరించింది.

ఫ్రాన్స్‌లో, సబ్సిడీల కోత పెట్టాలన్న అమెరికా డిమాండ్‌కు వ్యతిరేకంగా రైతులు రహదారుల దిగ్బంధనం (ఇది భారతదేశంలోని మాకు బాగా తెలిసిన ఆందోళన రూపం) చేపట్టారు.

## స్వేచ్ఛా మార్కెట్ సంజీవి మాత్ర కాదు

ఈ సంవత్సరం ఏప్రిల్ 2న ఇ. సి. దేశాలన్నిటిలో మిలియన్‌ల కొలది కార్మికులు పని నిలుపుదల చేసి, సమన్వయపూర్వకంగా ప్రదర్శనలు జరిపారు.

ఈ సెమినార్‌లో పాల్గొంటున్న సోదర పార్టీల నుంచి మరిన్ని వివరాలు, వాస్తవాలూ వింటామని ఆశిస్తున్నాం. మేము మా పత్రికలో వచ్చిన కొద్ది విషయాలను మాత్రమే ప్రస్తావించాం. కామెర్ల రోగులైన ప్రచురణకర్తలు కొందరు మా ప్రజల మేలుకొరకు వారి దృష్టికి తెచ్చిన సానుకూలమైన, సంక్షోభరహితమని చెప్పబడుతున్న, వర్గపోరాట రహితమైన 'స్వేచ్ఛా మార్కెట్' సువర్ణావకాశమనే ముద్రను తుత్తునియలు చేయటానికి ఈ వాస్తవాలు చాలు.

సామ్రాజ్యవాద దేశాలు తమ పూర్వపు వలస దేశాలలో తమ సరుకులకు మార్కెట్ లభించే కొత్త ప్రాంతాల కొరకు, తమ బహుళజాతి కంపెనీలు, మాంద్యంలో కొట్టుమిట్టాడుతున్న పరిశ్రమలు పెట్టుబడులు పెట్టే వసరు కొరకు, చౌకగా శ్రమ, ముడి పదార్థాలు లభించే ప్రదేశాల కొరకు, రోదసిని కాలుష్యం చేయటాన్ని, పర్యావరణను కలుషితం చేయటాని, ఆపండని తమను గట్టిగా కోరగల శక్తి ఇంకా లేని ప్రాంతాల కొరకు వెదుకుతున్నాయి.

తక్కువ అభివృద్ధి చెందిన దేశాలు సామ్రాజ్యవాదుల, వాటి ఆర్థిక సహాయక తదితర సంస్థల శృంఖలాలలో చిక్కేకొలదీ వాటి కడగండ్లు పెరుగుతున్నాయి. అవి ఎంతగా అప్పుల్లో, ఎంతగా దారిద్ర్యంలో చిక్కుకుంటే అంతగా ఈ దేశాలకు ఎయిడ్స్, ఇతర రోగాలు 'ఎగుమతి' చేయబడుతున్నాయి. తృతీయ ప్రపంచ దేశాలలో నిరాశా నిస్పృహకు, అవకాశాల లేమికి అసమానత పెరుగుదల తోడవుతున్నది.

సోమాలియా, ఇథియోపియాలలో, ప్రపంచంలోని కొన్ని యితర భాగాలలో 'మానవతాపూర్వక జోక్యం'గా చెప్పబడుతున్నది కూడా ఈ దేశాలను సామ్రాజ్యవాద పెత్తనం క్రిందకు తీసుకురావటానికి సైనికపరమైన ప్రయత్నం తప్ప వేరుకాదు. ఇదే పెద్దమనుషులు, ప్రపంచంలో ఉత్తమమైన వైద్య సేవగా పరిగణించబడుతున్న క్యూబా వైద్య సేవా నిర్వహణకు మందుల సరఫరాను సైతం నిరాకరిస్తూ ఆ దేశంపై విధిస్తున్న రెట్టింపు దిగ్బంధనం ఈ మానవతా కృషి బూటకత్వాన్ని బట్టబయలు చేస్తున్నది.

## పూర్వపు సోషలిస్టు దేశాలు : బలవంత ప్రయాణాలు

'ప్రచ్ఛన్న యుద్ధం' ముగింపు ప్రపంచానికి శాంతిని తీసుకురాలేదు. అనేక ప్రాంతీయ, స్థానిక యుద్ధాలనూ, ఐక్యరాజ్య సమితి ముసుగు క్రింద వాటిలో సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష జోక్యాన్ని మనం చూస్తున్నాం.

పూర్వపు సోషలిస్టు దేశాలలో పెట్టుబడిదారీ వ్యవస్థలోకి బలవంతపు ప్రయాణం అపహాస్యభాజనంగా రుజువవుతున్నది. ఉత్పత్తి గణనీయంగా తగ్గిపోయింది. పరిశ్రమలు వేలసంఖ్యలో మూతపడుతున్నాయి. గతకాలపు స్మృతిగా వుండిన నిరుద్యోగం తిరిగి పెరుగుతున్నది. మహిళలు మరీ ఎక్కువగా ఇందుకు గురి అవుతున్నారు. ద్రవ్యోల్బణం చుక్కలవైపు ప్రయాణిస్తున్నది; కరెన్సీ వ్యవస్థ పూర్తి సంక్షోభంలో పడింది. గత వ్యవస్థపై కురిపించిన శాపనార్థాలన్నీ, లేక ప్రైవేటీకరణ దిశగా ఉన్మాదపూర్వక ప్రయాణంగానీ, పెట్టుబడిదారీ పారిశ్రామిక

వేత్తల వర్గాన్ని సృష్టించలేదు; అందుకు బదులుగా, చట్టా వ్యాపారుల, మధ్యదళారుల, స్మగ్లర్ల, మాఫియా ముఠాల, పదవీకాంక్ష పరుల, అవకాశవాదుల వర్గం ఉద్భవించింది.

జాతీయ దురహంకారం ప్రజలమధ్య నెలకొని వున్న సంబంధాలను తునాతునకలు చేస్తున్నది; అనేకచోట్ల అంతర్యుద్ధ పరిస్థితి నెలకొనివుంది.

ఉత్సాహవంతులైన పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రచారకులు కొందరు వూహించినట్లుగా ఆ వ్యవస్థ పునరుద్ధరణ సులువుగా కనిపించటం లేదు; ఈ ప్రభుత్వాలను, ముఖ్యంగా మాస్కోలో తమ మనిషిగావున్న అధ్యక్షుడు ఎల్ట్సిన్‌ను బలపరిచేందుకు జి-7 దేశాల నుండి 'సహాయంగా' ఎన్ని బిలియన్ డాలర్లు కుమ్మరిస్తున్నా ప్రయోజనం కనిపించటంలేదు.

సోషలిజం సాధించిన విజయాలను తునాతునకలు చేయటానికి ఉద్దేశించిన విధానాలకు ప్రజలలో ప్రతిఘటన పెరుగుతున్నది. ఆర్థిక వ్యవస్థ. ప్రజాస్వామ్యం ఎదుర్కొంటున్న ప్రాథమిక వైరుధ్యాలను, ఆర్థిక సమస్యలను రెఫరెండాలు పరిష్కరించజాలవు.

రష్యాలో, పూర్వపు సోవియట్ యూనియన్‌లోని కొన్ని యితర రిపబ్లిక్‌లలో కమ్యూనిస్టులు పార్టీగా పునర్నిర్మాణం అవుతుండటం, తమకుతామై పునః సమీకరణ అవుతూ ఉండటం ఈ నిరాశాజనక పరిస్థితిలో ఒక సానుకూల లక్షణం. తక్షణ, దీర్ఘకాలిక కర్తవ్యాలను నిర్దేశిస్తున్న కార్యక్రమం ప్రాతిపదికపై ఐక్యం కావటానికి వారు ప్రయత్నిస్తున్నారు. వారి వ్యూహాత్మక లక్ష్యం సోషలిస్టు సమాజంవైపు ప్రయాణించటం. మార్క్సిజం-లెనినిజం సూత్రాలపైన, ప్రాథమిక పార్టీ శాఖల చొరవను వక్కాణిస్తూ ప్రజాస్వామ్యయుత కేంద్రీకరణ సూత్రంపైన వారు దృఢంగా నిలబడటం గమనించదగ్గ విషయం. ప్రజా సమస్యలపై ఉద్యమ క్రమంలో ఈ పార్టీలు తమ పలుకుబడిని పెంచుకుంటున్నాయి.

గొప్ప విప్లవ అనుభవం కలిగి వున్నటువంటి, సోషలిజం విజయాలను అనుభవించినటువంటి రష్యా, ఇతర దేశాల ప్రజల చేతిలో అంతిమ నిర్ణయం వుంది; పెట్టుబడిదారీ వ్యవస్థలోకి తిరిగి వెళ్ళటాన్ని వారు కోరుకోరు; గతంలోని తప్పులు, వక్రీకరణల నుండి వారు నిస్సందేహంగా గుణపాఠాలు తీసుకుని వుంటారు.

ఈనాటి ప్రపంచంలో సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలు పదునెక్కుతున్నట్లు మరింత స్పష్టంగా వెల్లడవుతున్నది. అమెరికన్ సామ్రాజ్యవాదం, యూరప్ సమాజంమధ్య, అమెరికా-జపాన్ మధ్య, ఇ. సి. లోపల, ఐక్య జర్మనీ-

బ్రిటన్ మధ్య, ఈ రెండింటికీ ఫ్రాన్స్‌కు మధ్య వైరుధ్యాన్ని మనం చూస్తున్నాం. ఈ వైరుధ్యాలు అభివృద్ధి చెందిన దేశాలకు, తృతీయ ప్రపంచ దేశాలకు మధ్య విడివిడిగా, మొత్తంగా వున్న వైరుధ్యాలకు అదనం.

ఒక గణనీయమైన పరిణామం ఏమంటే, జర్మన్, జపాన్ సైన్యాలు ఐ.రా.స. ఆధ్వర్యాన శాంతి కృషి పేరుతో యుద్ధానంతరం మొట్టమొదటిసారి తమ సరిహద్దులు దాటి బయటకు వెళ్లాయి.

మాస్ట్రిచ్ ఒడంబడిక విషయంలో పశ్చిమ దేశాల పాలకవర్గాలలో వచ్చిన చీలికను, అలాగే ఈ ఒడంబడికలోని అనేక నిబంధనల విషయంలో వాటికీ, ప్రజలకూ మధ్య వచ్చిన చీలికను కూడా ఎవరూ కప్పిపుచ్చజాలరు.

వివిధ కలయికలు, కూటములు, జి–7 వంటి ప్రత్యేక క్లబ్‌లు, తరచూ శిఖరాగ్ర సభలో – ఇవన్నీ ఈ వైరుధ్యాలను చర్చించుకుని, పరిష్కరించుకునే ప్రయత్నాలలో భాగమే. వర్ధమాన దేశాలను, తమ స్వంత కార్మికవర్గాన్ని పణంగా పెట్టి వీటిని పరిష్కరించుకోవాలని అవి ఎల్లప్పుడూ చూస్తుంటాయి. ఇందుకుగాను ఐ. ఎం. ఎఫ్., ప్రపంచ బ్యాంకులను, గాట్‌ను, చివరకు వివిధ ఐ.రా.స. సంస్థలు, ఏజెన్సీలను అవి బరితెగించి ఉపయోగించుకుంటున్నాయి.

ఫ్రాన్స్‌లో సోషలిస్టుల పరాజయం, ఇంగ్లండ్‌లో లేబర్ పార్టీకి, జర్మనీ, ఇతర పశ్చిమ యూరప్ దేశాలలో సోషల్ డెమొక్రాట్‌లకు తగిలిన ఎదురుదెబ్బలు వామపక్షం క్షీణిస్తున్నదని, ఆ ప్రాంతాలలో మితవాదులవైపు రాజకీయ మొగ్గు వచ్చిందనే ప్రచారాన్ని ముందుకు తెచ్చాయి.

పెట్టుబడిదారీ వ్యవస్థలో సోషలిజం సమ్మిశ్రితం కావటం, విలీనం కావటం 'నూతన వాస్తవికత' అంటూ మెత్తగా మాట్లాడినటువంటి, సోషలిస్టు వ్యవస్థను నిందించే బృందగానంలో చేరి సోషలిజాన్ని పూర్తిగా విడిచిపెట్టినట్టి సోషలిస్టులు లేక సోషల్ డెమొక్రాట్‌ల బలం క్షీణించిందని వాస్తవాలు తెలుపుతున్నాయి. సోషల్ డెమొక్రాట్‌లు పెట్టుబడిదారులకన్నా 'తెలివైనవార'ని, 'పరిశుద్ధుల'ని, పెట్టుబడిదారీ వ్యవస్థను పెట్టుబడిదారులకన్నా మెరుగ్గా వీరు నిర్వహించగలరని ఓటరు విశ్వసిస్తాడని ఆశించలేము.

## కమ్యూనిస్టుపార్టీల పునరుజ్జీవం

భావజాలం విషయంలో, సోషలిజానిదే భవిష్యత్ అన్న తమ విశ్వాసంలో దృఢంగా నిలబడిన కమ్యూనిస్టులు తమ ప్రజా పునాదిని నిలుపుకున్నారు అనేక

దేశాలలో, లోగడ ఎదురుదెబ్బల తదుపరి వారు మళ్ళీ బలాన్ని పుంజుకుంటున్నారు.

నేడు ప్రపంచంలోని అనేక భాగాలలో కార్మికవర్గ పోరాటాలు, ముమ్మరమైన వర్గపోరాటాలూ ఉవ్వెత్తున సాగుతున్నాయి.

అందువల్ల, కార్మికవర్గం క్షీణిస్తున్నదన్న వాదనకు ప్రాతిపదికలేదు. అయితే సాంకేతిక విప్లవం ప్రభావంవల్ల, పర్యవసానంగా ఉత్పత్తి శక్తులలో వచ్చిన మార్పులవల్ల దాని పొందికలో గాఢమైన మార్పు వచ్చినమాట వాస్తవం. అది అనేక విషయాలలో మార్పు చెందింది. అయితే సామాజిక చొరవ తీసుకోగలిగిన వర్గంగా దాని సారాంశంలో మార్పులేదు. దాని మిత్రుల శ్రేణులు పెరుగుతున్నాయి. పోరాటరంగం విస్తరిస్తున్నది. కర్తవ్యాలు బహుముఖమూ, భిన్నత్వంతో కూడినవి అవుతున్నాయి. ఉద్యమ ఎత్తుగడలు నూతనత్వం పొందుతూ, అదే సమయంలో మరింత జటిలమవుతున్నాయి.

## భారతదేశ పరిస్థితులు

మా దేశం, దాని సమస్యలకూ వద్దాం.

భారతదేశం స్వాతంత్ర్యం సిద్ధించిన నాటి నుండి పెట్టుబడిదారీ పంథా అనుసరిస్తున్నది. కాగా ఆర్థిక వ్యవస్థకు బలమైన ప్రభుత్వరంగాన్ని నిర్మించే నిమిత్తం ప్రభుత్వ జోక్యం, సోషలిస్టు దేశాల సోదర సహాయంద్వారా స్వావలంబన మార్గంలో అభివృద్ధిపై వక్కాణింపు యివ్వబడింది. అయితే ఫ్యూడల్, గుత్త పెట్టుబడిదారీ ప్రయోజనాలతో అనంతమైన రాజీలు వుండనే వున్నాయి.

ఈ పెట్టుబడిదారీ పంథానుండి వైరుధ్యాలు వృద్ధివించాయి. అయితే 70వ దశకం చివరినుండి, ముఖ్యంగా ప్రస్తుత ప్రభుత్వం అధికారంలోకి వచ్చిననాటి నుండి పూర్వపు వ్యూహం స్థానే ఐ. ఎం. ఎఫ్. – ప్రపంచ బ్యాంక్ నిర్దేశించిన వ్యవస్థాగత మార్పుల క్రింద నిర్దేశించిన అభివృద్ధికి మార్గం శీఘ్రంగా తెరువబడుతున్నది.

దేశ రుణభారం ప్రస్తుతం రు. 5,51,000 కోట్లు వుంది. ఏటేటా అప్పులు తీర్చే భారం గణనీయంగా పెరిగింది. ఏటా రు. 750 కోట్లు నికరంగా బయటకు వెళుతున్నది. దేశం రుణ ఉచ్చులో వుంది.

సరళీకృతం చేయబడిన దిగుమతులు, ఎదుగుదలలేని ఎగుమతులు వాణిజ్య లోటును తీవ్రతరం చేశాయి. విదేశీ మారకద్రవ్య నిల్వలలో తరుగుదల ఏర్పడింది.

1991-92లో అభివృద్ధి రేటు కేవలం 1.2 శాతం. క్రూడ్ ఆయిల్ ఉత్పత్తి

10.8 శాతం తగ్గుతుందని అంచనా వేస్తున్నారు. విద్యుచ్ఛక్తి ఉత్పాదన ఈ సంవత్సరం 4.7 శాతం తగ్గిపోయింది.

30 ప్రభుత్వరంగ పరిశ్రమలు ప్రస్తుతం పరిశీలనలో వున్నాయి. వాటి ప్రైవేటీకరణ, పెట్టుబడులను వాటాలుగా విక్రయించటం జరుగుతున్నది. బహుళ జాతి కంపెనీలకు ద్వారాలు బార్లా తెరవటం స్వదేశీ పరిశ్రమలు మరిన్ని మూతపడటానికి దారితీస్తుంది.

నిరుద్యోగం పెన్నుపెరుగుతున్నది. ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజిలలో నమోదై వున్న దరఖాస్తుదారుల సంఖ్య 3 కోట్ల 70 లక్షలు దాటింది. వాస్తవ సంఖ్య దీనికన్నా రెండు రెట్లు ఎక్కువ వుంటుంది.

ద్రవ్యోల్బణాన్ని తగ్గించామన్న వాదనను అయిష్టంగా అంగీకరించినప్పటికీ, ధరలు చుక్కలవైపు ప్రయాణం చేస్తూనే వున్నాయి.

జనాభాలోని బలహీనవర్గాల కొరకు ఉద్దేశించబడిన ప్రభుత్వ పంపిణీ వ్యవస్థ కుదించబడుతున్నది. వ్యవసాయానికి సబ్సిడీలు తగ్గించబడుతున్నవి.

రూపాయి విలువ – తొలుత విలువ తగ్గించటంద్వారా, ఇప్పుడు డాలర్‌తో మార్కెట్ రేటు ప్రకారం పూర్తి మారకాన్ని అనుమతించటం ద్వారా తరిగిపోతున్నది.

ఈ విధానాలకు ప్రత్యామ్నాయం లేదన్న వాదనకు వామపక్ష ఆర్థికవేత్తలు బలమైన జవాబులు యిచ్చారు. వారు ప్రత్యామ్నాయ బడ్జెట్‌ను కూడా వెల్లడించారు.

గతంనుండి సంక్రమించిన రుగ్మతలపై పెట్టుబడిదారీ అభివృద్ధియొక్క ఆధునిక రుగ్మతలు, జాడ్యాలు వచ్చి చేరటంనుంచి మా సమస్యలు ఉత్పన్నమౌతున్నవి.

## సోషలిజమే మా మార్గం

అందువల్ల, మా ప్రజలను ఆర్థిక దోపిడీనుండి, సాంఘిక పీడననుండి విముక్తిచేసే వ్యవస్థగా సోషలిజమే మా మార్గం. సోషలిజం మార్గం సుదీర్ఘమైనది. బాధాకరమైనది అయినప్పటికీ, అనేక మధ్యంతర దశలున్నప్పటికీ అదే మా భవిష్యత్.

కార్మికవర్గం, మా శ్రమజీవులలోని యితర విభాగాలూ అనేక సమస్యలపై ఉద్యమంలో ముందుపీఠిన వున్నాయని మేము చెప్పగలం.

సంఘటిత కార్మికోద్యమంయొక్క బలహీనత దాని చీలికలోనేవుంది. అంతేగాక అసంఖ్యాకమైన శ్రామిక ప్రజా బాహుళ్యం ఇప్పటికీ నిర్మాణానికి వెలుపలే వున్నారన్నది వాస్తవం. దీనివల్ల అతి తక్కువ వేతనాలు, మెరుగైన వేతనాలు పొందే కార్మికుల ఆదాయాల మధ్య వ్యత్యాసం పెరిగింది; ఇది ఉద్యమంపై ప్రతికూల ప్రభావం కలుగజేస్తున్నది.

అయితే ట్రేడ్ యూనియన్ స్పాన్సరింగ్ కమిటీ ఐక్య కార్యాచరణల గూర్చి విశ్వాసాన్ని పెంపొందించగలిగింది; తద్వారా అసంఘటిత రంగంలోని విస్తృత విభాగాలను ఉద్యమ ప్రధాన స్రవంతిలోకి తీసుకురాగలిగింది.

ఇప్పటివరకు మా కార్మికులు, రైతు ఉద్యమాలు సమానాంతర పట్టాలపై ప్రయాణం చేశాయి. ఈ రెండింటి మధ్య అలయెన్స్ (మైత్రి) సాధించటానికి చెదురు మదురు ప్రయత్నాలు తప్ప నిలకడైన, చైతన్యపూరితమైన ప్రయత్నం పెద్దగా జరగలేదు. నూతన ఆర్థిక విధానాలలో అంతర్భాగ అంశం అయిన డంకెల్ ప్రతిపాదనలు అటువంటి మైత్రీసాధనకు ప్రాతిపదిక కల్పిస్తున్నవి.

భారతదేశంలోవలె యూరప్, తృతీయ ప్రపంచ రైతులకు సబ్సిడీలు తగ్గించాలని డంకెల్ డిమాండ్ చేస్తుండగా, అమెరికా ప్రభుత్వం కార్గిల్, డ్రిఫూస్, కాంటినెంటల్ కంపెనీలకు టన్ను 1కి 38.50 డాలర్ల సబ్సిడీ యిచ్చింది. ఈ మూడూ ధాన్య వ్యాపారంలో అతిపెద్ద బహుళజాతి కంపెనీలు. విత్తనాలు, ఉపకరణాలనుండి వాణిజ్యం, వ్యవసాయోత్పత్తుల ప్రాసెసింగ్ వరకూ మా రైతులపై అజమాయిషీ చేయబోతున్నవి ఈ కంపెనీలే. ఉత్పత్తిని పునః ప్రారంభించటానికి విత్తనాలను దాచుకోవటం మా దేశంలో తరతరాలుగా రైతులు అనుసరిస్తున్న సాంప్రదాయం; ఇదికూడా ఇకపై 'దగా'గా పరిగణించబడుతుంది. డంకెల్ ముసాయిదాలో వున్న మార్కెట్ అందుబాటు నిబంధనలు దేశ ఆహార ధాన్యాల అవసరాలలో కనీసం 2 శాతం దిగుమతి చేసుకోవటాన్ని నిర్బంధం చేస్తున్నవి. భారతదేశంలో ఉప్పు ఉత్పత్తికి దాదాపు 2 వేల హెక్టార్ల భూమిపై ప్రత్యేక హక్కును కార్గిల్‌కు ఇవ్వటం యాదృచ్ఛికం కాదు.

## ఐక్య ఉద్యమాల ఆవశ్యకత

ఉద్యోగాలు, నిరుద్యోగం సమస్యపై కూడా ట్రేడ్ యూనియన్, యువజన ఉద్యమాలు ఇంతవరకు ఐక్యంగా ఆందోళన చేయలేకపోయాయి.

ఇటీవల ట్రేడ్ యూనియన్‌లు చొరవ తీసుకుని అన్ని ప్రజాసంఘాల రైతు, వ్యవసాయ కార్మిక, యువజన, విద్యార్థి, మహిళ– జాతీయ సదస్సును నిర్వహించి,

సంయుక్తంగా దశలవారీ ఉద్యమానికి కార్యక్రమం రూపొందించాయి. దీని పతాక ఘట్టంగా సెప్టెంబర్ 9న భారత్ బంద్ నిర్వహించబడుతుంది. ఇది జంట ప్రమాదాలైన నూతన ఆర్థిక విధానం, మతోన్మాదుల దాడికి వ్యతిరేకంగా ఉద్దేశించబడిన సమన్వయపూర్వక ఉద్యమం ఇది. ప్రజాతంత్ర తరగతుల, ప్రజా బాహుళ్యం పోరాట మైత్రిని పటిష్టం చేస్తుంది.

స్థూలంగా చెప్పాలంటే, జాతీయ రాజకీయాలలో కార్మికులకు ముఖ్యమైన పాత్ర వుందని మా సమాజంలోని ప్రజాతంత్రవాదులంతా గుర్తిస్తున్నారు. అందువల్ల మనం చూస్తున్నది సమాజంలోని విభిన్న తరగతుల కార్మికులతోపాటు సమీకరించబడుతున్న వర్గపోరాట వ్యక్తీకరణ. అయితే ఉద్యమానికి అవసరమైన ప్రగాఢత, విస్తృతి కల్పించే నిమిత్తం, అన్ని రంగాలలో-ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సైద్ధాంతిక, ఆచరణాత్మక- పోరాటం నిర్వహించవలసిన స్థాయికి చైతన్యం ఇంకనూ చేరవలసి వుంది.

సామాన్య ప్రజానీకంలో మెజారిటీ మత కలహాలకు దూరంగా వున్న మాట వాస్తవం; మంచి ఇరుగుపొరుగువారుగా శాంతి, సామరస్యతతో జీవించటాన్నే ఎంచుకుంటున్నారు; అవసరమైనప్పుడు ఒకరికొకరు రక్షణ ఇచ్చుకుంటున్నారు. అయితే మతోన్మాద శక్తులు తమ దుష్కృత్యాలకు పారిశ్రామిక కేంద్రాలను ప్రధానంగా లక్ష్యంగా పెట్టుకున్నట్లు కనిపిస్తున్నా, కార్మికవర్గం ఆ శక్తులకు వ్యతిరేకంగా జోక్యం చేసుకోవలసినంత చురుకుగా జోక్యం చేసుకోలేదు.

## మతోన్మాద వ్యతిరేక పోరాటం

మతోన్మాదానికి వ్యతిరేకంగా పోరాటం ప్రజాస్వామ్యంకొరకు, న్యాయమైన సామాజిక వ్యవస్థకొరకు జరిపే పోరాటంనుండి విడదీయరానిది. అధికార అందలం ఎక్కటానికి, ప్రజల ఆలోచనలకు మానసికంగా సంకెలలు వేయటానికి మతాన్ని ఉపయోగిస్తున్న వారితో పోరాటం చేయటానికి శాస్త్రీయమైన భౌతికవాద దృక్పథం, మార్క్సిస్టు విశ్లేషణా పదతి మాత్రమే మాకు సహాయపడుతున్నది. మన స్వంత గత వారసత్వాన్ని దాని చారిత్రక నేపథ్యంలో సవ్యంగా వ్యాఖ్యానించటానికి, అందులో పురోగామి దృక్పథం, మానవతా వాదంతో కూడిన దానినంతనూ పరిరక్షించటానికి అది మనకు సహాయపడుతుంది.

భారతీయ సమాజంలో మతం సాంప్రదాయాలకు సంబంధించి, సనాతనవాదం సాంఘిక సంస్కరణోద్యమాలకు సంబంధించి, వర్గ పోరాటం – వర్గ సంఘర్షణలకు సంబంధించి, జాతీయ సమగ్రత లేక జాతుల, ప్రాంతీయ వేర్పాటువాదం యొక్క

చారిత్రక ధోరణులకు సంబంధించి, భాష, సంస్కృతి విషయంలో దాని వైవిధ్యానికి సంబంధించి ఎన్ని సంఘర్షణలు, వైరుధ్యాలున్నప్పటికీ అందులో ఒక అంతర్గతమైన, లోతైన తార్కిక ధోరణి కనిపిస్తుంది. ఈ సమస్యలలో ప్రతి ఒక్కదానికీ కొంత స్వయం ప్రతిపత్తిగల అస్థిత్వం, అభివృద్ధి సూత్రాలు వున్నాయి. ఇవన్నీ ఆధునిక పెట్టుబడిదారీ యుగంలోకి మా దేశ సాంఘిక, ఆర్థికాభివృద్ధి పరివర్తన క్రమంలో వుత్పన్నమవుతున్నాయి. వాటి నిర్దిష్టమైన సాంఘిక, చారిత్రక సంబంధం నుండి వాటిని విడదీయలేము. మొత్తంగా వాటిని, వాటి అంతర్ సంబంధాన్ని పరిశీలించి, అవగాహన చేసుకోవటానికి మార్క్సిజం - లెనినిజం ఒక్కటే మనకు సహాయ పడుతుంది.

"మానవ నాగరికత, సంస్కృతి యొక్క ఉన్నత పథానికి చెందినది మార్క్సిజం. అందులో భారతీయ నాగరికత కూడా చేరి వుంది." మార్క్సిజం భారతీయ వారసత్వానికి 'అన్య'మైనదీ, మన ప్రాచీన వారసత్వాన్ని అవగాహన చేసుకోవటానికి పశ్చిమంనుండి అరువు తెచ్చుకున్న సాధనమూ కాదు. మార్క్సిజం-లెనినిజం ఆవిర్భావానికి భూమికగా వున్న యూరోపియన్ ఆలోచనకు, మొత్తం పరిజ్ఞానానికీ భారతీయ తత్వశాస్త్రం, సంస్కృతి, వారసత్వం యొక్క దోహదం లేకుండా పోలేదు.

## పార్టీ మహాసభ ఉద్ఘాటన

ఈ అవగాహననే, 1992 ఏప్రిల్‌లో జరిగిన మా పార్టీ గత మహాసభ ఆమోదించిన పత్రాలలో పొందుపరచటం జరిగింది :

"సి. పి. ఐ. సోషలిజం లక్ష్యానికి కట్టుబడి వుంది. భారతీయ వాస్తవికతను అర్థం చేసుకోవటానికి మార్క్సిజం-లెనినిజం శాస్త్రాన్ని నిరంతరం అభివృద్ధిచేస్తూ వుండాలి. విప్లవ పరివర్తనకోసం సాధ్యమైన అన్ని సామాజిక శక్తులనూ సమీకరించేందుకు ఇది మార్గదర్శకంగా వుండాలి. మార్క్సిజం-లెనినిజంను ఒక పిడివాదంగానూ, మార్పులేని సిద్ధాంతంగానూ మేము భావించం. అంతిమ సత్యం ఆవిష్కరణ అయినట్లుగా భావించం భారతదేశంలోనూ, ప్రపంచంలోనూ గత కాలపు సంస్కృతి, ఆలోచనలోని అభ్యుదయకర సానుకూల అంశాలన్నింటినీ గౌరవిస్తాం. వాటిని ప్రజల క్షేమంకొరకు వినియోగించుకొనటానికి ప్రయత్నిస్తాం."

"మన పార్టీ చరిత్ర, జాతీయ అభివృద్ధి ద్వారా స్పష్టమైన ఒక సత్యాన్ని నొక్కి చెప్పాలి; ఏ పరిస్థితుల్లోనూ దానిని తక్కువ అంచనా వేయరాదు. అదేమంటే సోషలిజానికిగాని, ప్రజాస్వామ్యానికిగానీ నమూనాలు అంటూ లేవు. మార్క్సిస్టు

సిద్ధాంతాన్ని మనం భారతీయ ప్రత్యేకతలతో మేళవించాలి; భారతీయ సంస్కృతి, సాంప్రదాయాలు, సామాజిక అభివృద్ధికి సంబంధించిన వారసత్వంతోనూ, అలాగే స్వాతంత్ర్యం కొరకు సాగించిన మన జాతీయ పోరాట గొప్ప అనుభవంతోనూ మిళితం చేయాలి."

"భారతదేశంలోని కమ్యూనిస్టులకు ప్రజాస్వామ్యాన్ని కాపాడటం, విస్తరించటానికై జరిగే పోరాటం, సోషలిజానికై సాగించే పోరాటానికి పూర్వరంగంగా వుంటున్నది. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రజాతంత్ర హక్కులకు మానవ హక్కులకు పోరాటం జరిపిన సాంప్రదాయం కలిగి వుంది. ఈ అంశాన్ని విస్మరించినపుడల్లా దుష్ఫలితాన్ని అనుభవిస్తూనే వున్నాం... మనకు సంబంధించినంత వరకూ సోషలిజం, ప్రజాస్వామ్యం, ప్రజానీకంతో సన్నిహిత సంబంధాలు, ప్రజా కార్యాచరణ ఇవన్నీ పరస్పర సహాయకాలు. ఒకటి మరొకదానిని ముందుకు తీసుకుపోతుంది."

---

"బుద్ధుడు, హెరాక్లిటిస్ - ఉభయులు గతితార్కిక దృక్పథాన్ని వెలిబుచ్చటానికి ఒకే రకమైన ప్రతీకలను వాడారు." —దేవీప్రసా

(ది బిగినింగ్స్ గ్రంథం - 134 పేజీ

---

# మహిళా సమస్యలు

## (కమ్యూనిజం 1993 ఏప్రిల్ ప్రత్యేక సంచిక)

నేటి స్త్రీ తరతరాల భూస్వామ్య, ఛాందస భావాల రక్కసి ముళ్లల్లోను, పెట్టుబడిదారీ వ్యాపార విష సంస్కృతిలోను చిక్కుకు పోయిన తన జీవితాన్ని అతిజాగ్రత్తగా విడిపించుకొని సరిచేసుకోవాలని ప్రయత్నిస్తూంది. శతాబ్దాల అణచివేత, తన సహజ వికాసాన్ని దిగ్బంధం చేయగా ఊపిరాడని స్త్రీ - నూతన భావాల ప్రాణ వాయువు కోసం అన్వేషిస్తూంది.

ఈ నేపథ్యంలో ఒక్కసారి స్త్రీల సమస్యలన్నింటిని సాకల్యంగా, సమగ్రంగా, నిర్మొహమాటంగా చర్చించడం, పరిష్కార మార్గాలను అన్వేషించడం ప్రగతిశీలుర కర్తవ్యం.

ఈ దృష్టితోనే 1993 మార్చి 6, 7 తేదీలలో ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య, కాకినాడ శాఖ వారి ఆధ్వర్యాన స్త్రీల సమస్యలపై రాష్ట్ర స్థాయి సదస్సు జరిగింది. ఈ సదస్సులో సమర్పించబడిన 26 అధ్యయన పత్రాలను, వివిధ ప్రముఖులు వ్రాసిన మరో 14 వ్యాసాలను ఏర్చి కూర్చి కమ్యూనిజం ప్రత్యేక సంచిక ప్రచురించాం. మహిళా సమస్యల గురించి ఇంత సమగ్రమైన ప్రత్యేక సంచిక ఇటీవల వెలువడ లేదు. ఇంకా కొన్ని కాపీలు మాత్రమే మిగిలి ఉన్నాయి. సంచిక వెల రు. 10/- లు మాత్రమే. కాపీలు కావలసినవారు "మేనేజరు, కమ్యూనిజం, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-4" కు వ్రాయండి. మరియు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్ని బ్రాంచీలలో కూడా కాపీలు దొరుకుతాయి.

Printed and Published by T. Venkateswara Rao for Visalaandhra Vignana Samithi, Vijayawada-4. at Nagarjuna Enterprises. Vja.-4
Editor Edupuganti Nageswara Rao



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA101M102 |
| పుస్తకం పేరు | కమ్యూనిజం |
| తారీఖు | 14 March 2025 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C.I BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Saranya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |